# జ్యోతిషగ్రంథములు



| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అఱువది (౬౦) సంవత్సరముల పంచాంగము (1867-1926) | | అచ్చు | |
| అష్టకవర్గు సాంధ్రతాత్పర్యము | ... | 0 | 8 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము | ... | 0 | 12 |
| కాలామృతము - ఆంధ్రటీకా-తాత్పర్యసహితము | ... | 3 | 0 |
| కృష్ణవాస్తుశాస్త్రము, అను వాస్తుసారసంగ్రహము | ... | 1 | 0 |
| కేరళప్రశ్నము. సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 4 |
| గౌళిశాస్త్రము, తెలుఁగువచనము | ... | 0 | 4 |
| ఛప్పన్నము. ప్రశ్నశాస్త్రము, తాత్పర్యసహితము | ... | 0 | 8 |
| జలార్గళశాస్త్రము, ఆంధ్రటీకాసహితము | ... | 0 | 8 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము | ... | 1 | 0 |
| [illegible]నవనీతము | .. | 3 | 0 |
| [illegible]మణి, సంస్కృతము | ... | 0 | 8 |
| బృహజ్జాతకము సాంధ్రటీకా తాత్పర్యసహితము | ... | 5 | 0 |
| [illegible]మవాస్తువు. సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| [illegible]త్రములు ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 8 |
| [illegible]ద్రిక ,, | ... | 1 | 0 |
| [illegible]కర్యము ,, | ... | 1 | 0 |
| [illegible]ము ,, | ... | 1 | 4 |
| [illegible]మాల (వర్షఫణి) ,, | ... | 0 | 4 |
| వాస్తుసర్వస్వము ,, | ... | 0 | 6 |
| శ్రీపతి, సాంధ్రతాత్పర్యము | ... | 4 | 8 |
| శకునశాస్త్రము. (శిఖినరసింహాశతకము) | ... | 0 | 8 |
| శెట్టిమతశాస్త్రము, సాంధ్రతాత్పర్యము | ... | 1 | 8 |
| ముహూర్తదర్పణము, సటీక | ... | 2 | 0 |
| షోడశప్రశ్నరత్నావళి, నెపో [illegible] | [illegible] | | |
| తెలుఁగు | | 0 | 4 |

శ్రీరస్తు

# మేఘసందేశము

శ్రీమహాకవి కాళిదాసకృతము.

సంస్కృతాంధ్రవ్యాఖ్యానసహితము.



చెన్నపురి :

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1958

# పీఠిక

మేఘసందేశము కవికులశిరోమణి యగు కాళిదాసుఁడు రచియించినది. ఈతఁడు రచించినవి రఘువంశాది మహాకావ్యములును, శాకుంతలాది నాట్యప్రబంధములును, శ్రుతబోధాది లక్షణగ్రంథములును జగత్ప్రసిద్ధంబు లయి విలసిల్లుచున్న యవి.

అందు ఈ మేఘసందేశము కవి కల్పించిన కథగలది.

ఎట్లనిన:—కుబేరుని కొలువునం దొక యక్షుఁడు తన యధికారమునందుఁ బ్రమాద పడుటవలన కుబేరుఁడు కోపించి వాని నొక సంవత్సరము కాంత నెడఁ బాసి యడవులయందుండు మని శపించెను. అంత నా యక్షుండు చిత్రకూట పర్వతమున నివాసము చేసికొని కాంతా విరహమున కష్టముగా నెనిమిది మాసములు గడపెను. అంత ఆషాఢ మాసము రాఁగానే యా కొండచరియను గ్రమ్ముకొని యున్న మేఘమునుఁ జూచినవాఁడై కాంతయం దతి సక్తమైన మనస్సు గలవాఁడు కావున యుక్తాయుక్త విచారము లేక జడరూప మగు నా మేఘమునుఁ జూచిఁ తన క్షేమవార్తను తన వనితకుఁ జెప్పు మని ప్రార్థించి పోవలసిన మార్గమును, అలకాపురిని, అందు తన గృహమును, తన గృహిణిని, ఆమెకుఁ జెప్పవలసిన సందేశమును విశదీకరించెను. ఆదికవి యగు వాల్మీకి వలె ఈ కవిశిరోమణియు నుదార మధురంబు లగు కవితావిశేషంబుల లోకోత్తరుం డైనవాఁ డని జగత్ప్రసిద్ధమే గదా?

ఇందుఁ యక్షదంపతుల విప్రలంభ శృంగారము ప్రధానముగా వర్ణింపఁబడినది. శివకేశవాది దేవతామాహాత్మ్యంబులును పుణ్యతీర్థంబులును విశిష్ట దేశంబులును నానావిధంబులగు లోకవృత్తంబులును లోనుగాఁగల యర్థంబు లనేకంబులు ప్రసక్తానుప్రసక్తములై నిపుణతరంబుగ నిరూపింపఁబడి యున్నవి.

ఇట్లు,

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీ ర స్తు

# మేఘ సందేశః

## ప్రథమః సర్గః.



శ్లో.కశ్చిత్కాన్తావిరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః
శాపేనాస్తంగమితమహిమా వర్షభోగ్యేణ భర్తుః,
యక్షశ్చక్రే జనకతనయాస్నానపుణ్యోదకేషు
స్నిగ్ధచ్ఛాయాతరుషు వసతిం రామగిర్యాశ్రమేషు. 1

టీ. స్వాధికారాత్; స్వ=తనయొక్క, అధికారాత్ = అజ్ఞనుండి, ప్రమత్తః - ఏమరినవాఁడు గనుకనే, కాంతా విరహ గురుణా; కాంతా = ప్రియురాలి (ని) యొక్క, విరహ = ఎడఁబాటుచేత, గురుణా = గొప్పదై (తరింప రానిదై), వర్షభోగ్యేణ = సంవత్సరకాల మనుభవింపఁ దగిన, భర్తుః=ప్రభువుయొక్క (కుబేరునియొక్క), శాపేన = శాపముచేత, అస్తంగమిత మహిమా; అస్తంగమిత = నాశమును బొందింపఁ బడిన, మహిమా = సామర్థ్యము గల, కశ్చిత్=ఒకానొక, యక్షః = యక్షుఁడు, జనక తనయా స్నాన పుణ్యోదకేషు; జనకతనయా = సీతాదేవియొక్క, స్నాన = స్నానముల చేత, పుణ్య=పవిత్రము లగు, ఉదకేషు = తీర్థములు గల, స్నిగ్ధ చ్ఛాయా తరుషు; స్నిగ్ధ=దట్టములైన, ఛాయా తరుషు=(నీడను గలిగించు) సురపొన్న చెట్లు గల, రామ గిర్యాశ్రమేషు: రామగిరి = చిత్రకూటపర్వతము యొక్క, ఆశ్రమేషు = ఆశ్రమములయందు, వసతిం = నివాసమును చక్రే = చేసెను.

తా. పూర్వ మొకయక్షుఁడు కుబేరునిచే నొక యధి కారము నందు నియమింపఁబడి యేమరుపాటుచే నా యధి కారము జక్కఁగాఁ జెల్లింపక యుండెను. దానిం జూచి కుబే రుఁడు వానిపైఁ గోపించి సంవత్సరకాలము కాంత నెడఁబాసి యడవులయందు నుండెదవు గాక యని శపించెను. ఆశాపము వలన నాతఁడు చిత్రకూట పర్వతమున సీతారాములు నివసిం చిన యాశ్రమములయం దుండి శాపప్రభావముచేత తన దివ్యవ్యక్తి పోయినవాఁడై ప్రియురాలి నెడఁబాసిన దుఃఖము చేత సంవత్సర కాలము విరహము నెంతో గొప్పకాలముగఁ గడపుచు నుండెను.

## శ్రీమల్లినాథకృత సంజీవినీవ్యాఖ్యానము.

మాతాపితృభ్యాం జగతో నమో వామార్ధజానయే,
సద్యోదక్షిణదృక్పాతసంకుచద్వామదృష్టయే.
అన్తరాయతిమిరోపశాన్తయే శాన్తపావనమచిన్త్యవైభవం,
తంనరం వపుషి కుఞ్జరం ముఖే మన్మహే కిమపి తున్దిలం మహః.
శరణం కరవాణి శర్మదం తే చరణం వాణి చరాచరోపజీవ్యం.
కరుణామసృణైః కటాక్షపాతైః కురుమామమ్బ కృతార్థసార్థవాహమ్.
భారతీ కాళిదాసస్య దుర్వ్యాఖ్యావిషమూర్ఛితా,
ఏషా సంజీవినీ టీకా తామద్యోజ్జీవయిష్యతి.
ఇహాన్వయముఖేనైవ సర్వం వ్యాఖ్యాయతే మయా,
నామూలం లిఖ్యతే కిఞ్చిన్నానపేక్షితముచ్యతే.
అథ తత్రభవాన్ కాళిదాసో నామ మహాకవిః
"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే,
సద్యః పరనిర్వృతయే కాన్తాసమ్మితతయోపదేశయుజే"
ఇత్యాద్యాలఙ్కారికవచనప్రామాణ్యాత్ కావ్యస్యానేకశ్రేయస్సాధనతాం,
"కావ్యాలాపాంశ్చ వర్జయే" దితి నిషేధశాస్త్రస్యాసత్కావ్య విషయ

తాం చ పశ్యన్ మేఘసందేశాఖ్యం కావ్యం చికీర్షుశ్చికీర్షితావిఘ్నపరిసమాప్తిసంప్రదాయావిచ్ఛేదలక్షణఫలసాధనత్వాత్ 'ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశో వాపి తన్ముఖ' మితి శాస్త్రాదాశీరాద్యన్యతమస్య ప్రబన్ధముఖలక్షణత్వాత్ కావ్యాదౌ యక్షస్య గిరినివాసరూపం వస్తు నిర్దిశతి కశ్చిదితి.— స్వాధికారాత్, ప్రమత్తః అనవహితః. 'ప్రమాదోఽనవధాన తే' త్యమరః. * 'జుగుప్సా విరామ ప్రమాదార్థానా ముపసంఖ్యాన' మిత్యపాదానత్వాత్ పఞ్చమీ, అత ఏవాపరాధా ద్ధేతోః, కాన్తావిరహేణ, గురుణా దుర్భరేణ, దుస్తరేణేత్యర్థః. 'గురుస్తు గీష్పతౌ శ్రేష్ఠే గురౌ పితరి దుర్భర' ఇతి శబ్దార్ణవే. వర్షం (సంవత్సరం) భోగ్యేణ వర్షభోగ్యేణ * 'కాలాధ్వనోరత్యన్తసంయోగే' ఇతి ద్వితీయా * 'అత్యన్తసంయోగే చే' తి సమాసః * 'కుమతి చే' తి ణత్వం, భర్తుః స్వామినః కుబేరస్య, శాపేన అస్తం నాశం, గమితః ప్రాపితః, మహిమా సామర్థ్యం, యస్య సోఽస్తంగమితమహిమా * అస్త మితి మకారాన్తమవ్యయమ్, తస్య* 'ద్వితీయే' తి యోగవిభాగాత్ సమాసః, కశ్చిత్, యక్షః దేవయోనివిశేషః. 'విద్యాధరోఽప్సరోయక్షరక్షోగన్ధర్వకిన్నరాః, పిశాచోగుహ్యకస్సిద్ధోభూతోఽమీ దేవయోనయ' ఇత్యమరః. జనకతనయాయాః సీతాయాః, స్నానైః అవగాహనైః, పుణ్యాని పవిత్రాణి, ఉదకాని యేషు తేషు, పావనే ష్విత్యర్థః. ఛాయాప్రధానా స్తరవః ఛాయాతరవః*శాకపార్థివాదిత్వా త్సమాసః, స్నిగ్ధాః సాన్ద్రాః, ఛాయాతరవో నమేరువృక్షా, యేషు తేషు, వసతియోగ్యేష్విత్యర్థః. 'స్నిగ్ధం తు మసృణే సాన్ద్రే' 'ఛాయావృక్షో నమేరుస్స్యా' ది త్యుభయత్రాపి శబ్దార్ణవే. రామగిరి రితి చిత్రకూటః, తస్యాశ్రమేషు, వసతిం స్థితిం, చక్రే కృతవాన్. అత్ర లేశత స్తత్రతత్రాద్రినగరనదీ సముద్రాదివర్ణనసంభవాత్ మహాకావ్యత్వమ్. రసశ్చాత్ర విప్రలమ్భశృఙ్గారః, తత్రాప్యున్మాదావస్థా; అత ఏవైకత్రానవస్థానం సూచిత 'మాశ్రమే ష్వి'తి బహువచనేన. సీతాం ప్రతి రామస్య హనుమత్సందేశం మనసి నిధాయ మేఘసందేశం కవిః కృతవానిత్యాహుః. అత్ర కావ్యే సర్వత్ర

మన్దాక్రాన్తావృత్తమ్ 'మన్దాక్రాన్తా జలధిషడగై ర్మోభనా తౌ గురూ చే'తి లక్షణాత్.

తస్మిన్నద్రౌ కతిచిదబలావిప్రయుక్తస్స కామీ
నీత్వా మాసాన్కనకవలయభ్రంశరిక్తప్రకోష్ఠః,
ఆషాఢస్య ప్రథమదివసే మేఘమాశ్లిష్టసానుం
వప్రక్రీడాపరిణతగజప్రేక్షణీయం దదర్శ. 2

టీ. తస్మిన్ అద్రౌ = ఆ (చిత్రకూట) పర్వతమునందు, అబలావిప్రయుక్తః, అబలా = (తన) స్త్రీతో, విప్రయుక్తః = ఎడఁబాపఁబడినవాఁడై, కనక వలయ భ్రంశరిక్త ప్రకోష్ఠః; కనక వలయ = బంగారు కడియము యొక్క, భ్రంశ = జారుటచే, రిక్త = వట్టిదైన, ప్రకోష్ఠః = ముంజేయి గల, కామీ = కాముకుఁ డగు, సః = ఆయక్షుఁడు, కతిచిత్ మాసాన్ = కొన్ని నెలలను, (ఇక్కడఁ గొన్ని యనఁగా నెనిమిది మాసము లని గ్రహింప వలయును, ఏల ననఁగా? ఇతఁడు మేఘునితోఁ జెప్పు నపుడు "నా శాపకాలము సంవత్సరమునకుగా నిఁక నాలుగుమాసము లున్న" వని చెప్పఁ బోవుచున్నాఁడు) నీత్వా = కడపి, ఆషాఢస్య = ఆషాఢమాసము యొక్క, ప్రథమదివసే = తొలి దినమునందు, ఆశ్లిష్ట సానుం; ఆశ్లిష్ట = ఆక్రమింపఁబడిన. సానుం = చఱియగలదై, వప్రక్రీడా పరిణత గజప్రేక్షణీయం; వప్రక్రీడా=చరియలను గోరాడుట యందు, పరిణత = అడ్డముగాఁ గొమ్ములతోఁ బొడుచుచున్నట్టి, గజ=ఏనుఁగువలె, ప్రేక్షణీయం = చూడఁదగిన, తం=ఆ మేఘమును, దదర్శ=చూచెను.

తా. ఆ యక్షుఁడు ప్రియురాలి నెడఁబాసి యుండుటచేఁ గృశించినవాఁడై యా కొండమీఁద నెనిమిది మాసములు కష్టముగ గడపెను. అంతట నాషాఢమాసము తొలి దినమునందు మేఘ మాకొండచరియను గ్రమ్ముకొని దరిని గోరాడు నట్టి యేనుఁగువలెఁ జూపట్టియుండెను.

తస్మిన్నితి.—తస్మిన్నద్రౌ, చిత్రకూటాద్రౌ,అబలా విప్రయుక్తః— అబలయా కాన్తయా, విప్రయుక్తః విరహితః, కనకస్య, వలయః, కటకం 'కటకం వలయోఽస్త్రియామి' త్యమరః. తస్య, భ్రంశేన పాతేన, రిక్తః శూన్యః, ప్రకోష్ఠః కూర్పరాధః ప్రదేశో, యస్య స తథోక్తః 'కక్ష్యాన్తరం ప్రకోష్ఠం స్యాత్ ప్రకోష్ఠః కూర్పరా దధ' ఇతి శాశ్వతః. విరహదుఃఖా త్కృశ ఇత్యర్థః. కామీ కాముకః, సః యక్షః, కతిచి న్మాసాన్ అష్టౌ మాసా ని త్యర్థః. 'శేషా న్మాసాన్ గమయ చతురో లోచనే మీలయి త్వే'తి వక్ష్యమాణత్వాత్, నీత్వా యాపయిత్వా. ఆషాఢానక్షత్రేణ యుక్తా పౌర్ణమా స్యాషాఢీ * 'నక్షత్రేణ యుక్తః కాల' ఇ త్యణ్, ఆషాఢీ పౌర్ణమా స్యస్మి న్మాస ఇ త్యాషాఢో మాసః * 'సాస్మిన్ పౌర్ణమా సీతి' సంజ్ఞాయామణ్, తస్య ఆషాఢమాసస్య, ప్రథమదివసే ఆద్యవాసర ఇ త్యర్థః, ఆశ్లిష్టసానుమ్ ఆక్రాన్తతటం, వప్రక్రీడాః ఉత్ఖాతకేళయః. 'ఉత్ఖాత కేళి శ్శృఙ్గాద్యై ర్వప్రక్రీడా నిగద్యత' ఇతి శబ్దార్ణవే. తాసు, పరిణతః తిర్యగ్దన్తప్రహారీ 'తిర్యగ్దన్తప్రహారీ తు గజః పరిణతో మత' ఇతి హలాయుధః. స చాసౌ గజశ్చ స ఇవ, ప్రేక్షణీయం దర్శనీయం, మేఘం దదర్శ. గజ ప్రేక్షణీయ మిత్యత్ర ఇవశబ్దలోపా ల్లుప్తోపమా.

కేచి 'దాషాఢస్య ప్రథమదివస' ఇత్యత్ర 'ప్రత్యాసన్నే నభసీ'తివక్ష్య మాణ నభోమాసప్రత్యాసత్త్యర్థం 'ప్రశమదివస' ఇతిపాఠం కల్పయన్తి, తద సంగతమ్; ప్రథమాతిక్రమణే కారణాభావాత్. నభోమాసప్రత్యాసత్త్య ర్థమి త్యుక్త మితిచే న్న; ప్రత్యాసత్తిమాత్రస్య స్వమాసప్రత్యాసత్త్యైవ దివసస్యా ప్యుపపత్తే రత్యన్తప్రత్యాసత్తేరుపయోగాభావేనావివక్షితత్వాత్ వివక్షితత్వేవా స్వపక్షేఽపి ప్రశమదివసాన్తిమక్షణే మేఘదర్శనకల్పనా యాం ప్రమాణాభావేన తదసంభవాత్. ప్రత్యుతాస్మత్పక్ష ఏవ కుశలః, సందేశస్య భావ్యనర్థ ప్రతీకారార్థస్య పురత ఏ వానుష్ఠానం యుక్తం భవే దిత్యుపయోగసిద్ధిః. ననూన్మత్తస్య నాయం వివేక ఇతి చేన్న; ఉన్మత్తస్య నానర్థప్రతీకారారమ్భ ప్రతిపత్తి ర పీతి సందేశ ఏవ మాభూత్; తథా చ

కావ్యారమ్భ ఏవ ప్రతిబద్ధః స్యాదిత్యహో మూలచ్ఛేదీ తవ పాణ్డిత్యప్రకర్షః! కథం తర్హి, 'శాపాన్తో మే భుజగశయనా దుత్థితే శార్ఙ్గపాణౌ' విత్యాదినా భగవత్ప్రబోధావధికస్య శాపస్య మాసచతుష్టయావశిష్టతోక్తిః, శయనైకాదశీ మారభ్యోత్థానైకాదశీపర్యన్తం మాసచతుష్టయం భవతి, దశదివసాధిక్యాదితిచేన్న; స్వపక్షేఽపి కథం సా వింశతిదివసన్యూనత్వాదితి సన్తోష్టవ్యమ్. తస్మాదీషద్వైషమ్య మవివక్షిత మితి సుష్ఠూక్తం 'ప్రథమదివస' ఇతి.

తస్య స్థిత్వా కథమపి పురః కౌతుకాధానహేతో
రన్తర్బాష్పశ్చిరమనుచరో రాజరాజస్య దధ్యౌ,
మేఘాలోకే భవతి సుఖినోఽప్యన్యథావృత్తి చేతః
కణ్ఠాశ్లేషప్రణయిని జనే కిం పునర్దూరసంస్థే. 3

టీ. రాజరాజస్య = (యక్షులకు రాజైన) కుబేరునియొక్క, అనుచరః = సేవకుఁడు (ఆ యక్షుఁడు), అన్తర్బాష్పః = కంటిలోపల నిమిడియున్నకన్నీళ్లు గలవాఁడై (అనఁగా నతఁడు ధీరోదాత్తుఁడు గాన తనకుఁ గలిగిన శోకప్రయుక్త మయిన బాష్పమును పైకిఁ దెలియనీయని వాఁడని భావము). కౌతుకాధానహేతోః; కౌతుక = ప్రియురాలితోఁ గూడియుండుట యందలి కోరికను, ఆధాన = కలిగించుటకు, హేతోః = కారణమైన, తస్య = ఆ మేఘము యొక్క, పురః = ఎదుటను, కథమపి = ఎట్టకేలకు, స్థిత్వా = నిలచి, చిరం = తడవుగా, దధ్యౌ = చింతించెను, (ఏల యనఁగా) మేఘాలోకే, మేఘ = మేఘముయొక్క ఆలోకే = దర్శనము కలుగుచుండఁగా, సుఖినోఽపి = (ప్రియురాలితోఁ గూడిన) సుఖముగలవానికిని, చేతః = మనస్సు, అన్యథా వృత్తిః; అన్యథా = మఱియొకవిధమైన (అనఁగా కామోద్దీపక మైన), వృత్తి = వ్యాపారముగలదిగా, భవతి = అగుచున్నది, కంఠాశ్లేష ప్రణయిని = కంఠాలింగనమును గోరుచున్న, జనే = జనము (ప్రియురాలు), దూరసంస్థే = దూరమునందునికి గలది యగుచుండఁగా, కిం పునః = ఇఁక నేమి చెప్పవచ్చును.

తా. సాధారణముగా మేఘదర్శనము ప్రియజన సాంగత్యమునందుఁ గోరికలను బుట్టించునది. అట్టి మేఘమును జూడగనే యాయక్షునకుఁ బ్రియురాలి నెడఁబాసి యుండుటవలని శోకముచేత కంట నీరు గ్రమ్మినను మహాపురుషుఁడు గావున దానిని బైకిఁ దెలియ నీయనివాఁడై తనకుఁ గలిగిన మనోవికార ముపశమించు దనుక యోజించుచుండెను.

తస్యేతి.—రాజానో యక్షాః 'రాజా ప్రభౌ నృపే చన్ద్రే యక్షే క్షత్రియశక్రయో'రితి విశ్వః. రాజ్ఞాం రాజా రాజరాజః కుబేరః. 'రాజరాజో ధనాధిప' ఇత్యమరః *'రాజాహస్సఖిభ్యష్టజి' తి టచ్, తస్య. అనుచరః యక్షః, అన్తర్బాష్పః ధీరోదాత్తత్వా దన్తః స్తమ్భితాశ్రుస్సన్, కౌతుకాధానహేతోః అభిలాషోత్పాదనకారణస్య. 'కౌతుకం చాభిలాషే స్యా దుత్సవే నర్మహర్షయో'రితి విశ్వః. తస్య మేఘస్య, పురః అగ్రే, కథమపి గరీయసా ప్రయత్నేనేత్యర్థః. 'జ్ఞాతహేతువివక్షాయా మప్యాది కథ మవ్యయం, కథమాది తథాప్యన్తం యత్నగౌరవబాధయో'రి త్యుత్పలమాలాయామ్. స్థిత్వా చిరం, దధ్యౌ చిన్తయామాస * 'ధ్యై చిన్తాయామి' తిధాతోర్లిట్. మనోవికారోపశమనపర్యన్తమితి శేషః; వికారహేతుమేవాహ మేఘాలోక ఇతి;—మేఘాలోకే మేఘదర్శనే సతి, సుఖినోఽపి ప్రియాజనసంగతస్యాపి, చేతః చిత్తం, అన్యథాభూతా వృత్తిః (వ్యాపారో) యస్య త దన్యథావృత్తి భవతి, వికృతి మాపద్యత ఇత్యర్థః, కణ్ఠాశ్లేషప్రణయిని కణ్ఠాలిఙ్గనార్థిని, జనే. దూరే సంస్థా (స్థితి) ర్యస్య తస్మిన్ దూరసంస్థే సతి, కింపునః సుఖినోఽప్యేవం కిల విరహిణ స్తు కిం వక్తవ్య మిత్యర్థః, విరహిణాం మేఘదర్శనం కామాదివికారోద్దీపన మితి భావః. అత్రార్థాన్తరన్యాసోఽలఙ్కారః, తదుక్తం దణ్డినా 'జ్ఞేయస్సోఽర్థాన్తరన్యాసో వస్తుప్రస్తుత్యకిఞ్చన, తత్సాధన సమర్థస్య న్యాసో యోఽన్యస్య వస్తునః' ఇతి.

ప్రత్యాసన్నే నభసి దయితాజీవితాలమ్బనార్థీ
జీమూతేన స్వకుశలమయీం హారయిష్యన్ప్రవృత్తిం,
స ప్రత్యగ్రైః కుటజకుసుమైః కల్పితార్ఘాయ తస్మై
ప్రీతః ప్రీతిప్రముఖవచనం స్వాగతం వ్యాజహార. 4

టీ. సః=ఆ యక్షుఁడు, నభసి = శ్రావణ మాసము, ప్రత్యాసన్నే= సమీపించినది యగుచుండఁగా, దయితాజీవితాలంబనార్థీ; దయితా= ప్రియురాలి యొక్క, జీవిత = ప్రాణము యొక్క. ఆలంబన = పట్టుదలను, అర్థీ = కోరుచున్న వాఁడై, జీమూతేన = మేఘునిచేత, స్వకుశలమయీం, స్వ = తనయొక్క, కుశలమయీం=క్షేమము ప్రధానము గాఁగల, ప్రవృత్తిం=వృత్తాంతమును, హారయిష్యన్ = (తన (ప్రియురాలికి) పనుపఁ గోరిన వాఁడై, ప్రత్యగ్రైః = నూతనము లయిన అనఁగా స్వభావముగా నాషాఢ మాసమునందుఁ బూచునట్టి), కుటజకుసుమైః కొండమల్లె పూవులచేత; కల్పితార్ఘాయ; కల్పిత = చేయఁబడిన, అర్ఘాయ = పూజగల, తస్మై=ఆమే ఘునికొఱకు, ప్రీతి ప్రముఖ వచనం; ప్రీతిప్రముఖ = ప్రీతిపూర్వక మైన, వచనం =మాటలుగలుగునట్లుగా, స్వాగతం = స్వాగతమా? (కుశలమా) అను మాటను, ప్రీతః = సంతోషించినవాఁడై, వ్యాజహార = పలికెను.

తా. యక్షుఁ డాషాఢ మాసము వెళ్లగనేవిరహి జనమునకు మిక్కిలి యుద్దీపక మగు వర్షర్తువునందు తన ప్రియురాలెట్లైనను బ్రాణమును ధరించి యుండుటకై తన క్షేమ వార్తను మేఘునిచేఁ బంపఁ గోరినవాఁడై క్రొత్తగాఁ బూచియున్న కొండమల్లె పూవులతోఁ బూజించి ప్రీతితో నామేఘుని గుశల మడిగెను.

. అథ సమాహితాన్తఃకరణః కిం కృతవానిత్యత్రాహ ప్రత్యాసన్న ఇతి.— సః యక్షః, యశ్చిరం దధ్యౌ స ఇ త్యర్థః, నభసి శ్రావణమాసే.

నభః ఖం శ్రావణో నభా’ ఇత్యమరః. ప్రత్యాసన్నే ఆషాఢానన్తర్యా త్వన్ని
కృష్టే సతి, దయితాలమ్బనార్థీ సన్ వర్షాకాలస్య విరహిదుస్సహ
త్వాత్ ‘ఉత్పన్న ప్రతీకారా దనర్థస్యోత్పత్తిప్రతిబన్ధ ఏవ వర’ మితి న్యా
యేన ప్రాగేవ ప్రియాప్రాణధారణోపాయం చికీర్షుస్సన్నిత్యర్థః. జీవస్య
(జీవనస్య) మూతః (పుటబన్ధో) జీమూతః *పృషోదరాదిత్వాత్సాధుః, తేన
జీమూతేన జలధరేణ ప్రయోజ్యేన, స్వకుశలమయీం స్వక్షేమప్రధానాం,
ప్రవృత్తిం వార్తాం. ‘వార్తా ప్రవృత్తిర్వృత్తాన్తః’ ఇత్యమరః. హారయిష్యన్
ప్రాపయిష్యన్* లృట్ శేషే చే’తి చకారాత్ క్రియార్థక్రియోపపదాత్
లృట్ప్రత్యయః. జీవనార్థం కర్మ జీవనప్రదేనైవ కారయితవ్య మితి భావః*
‘హృక్రోరన్యతరస్యా’మితి కర్మసంజ్ఞావికల్పాత్ పక్షే కర్తరి తృతీయా,
ప్రత్యగ్రైః అభినవైః, కుటజకుసుమైః గిరిమల్లికాభిః. ‘కుటజో గిరిమ
ల్లికే’ తి హలాయుధః. కల్పితార్ఘాయ. కల్పితః అనుష్ఠితః అర్ఘః పూజా
విధిః, యస్య తస్మై కల్పితార్ఘాయ, ‘మూల్యే పూజావిధావర్ఘః’ ఇత్యమరః.
తస్మై జీమూతాయ * ‘క్రియాగ్రహణం కర్తవ్యమితి’ సంప్రదానత్వా చ్చ
తుర్థీ. ప్రీతిప్రముఖాని (ప్రీతిపూర్వకాణి) వచనాని యస్మిన్ కర్మణి త
త్ప్రీతిప్రముఖవచనం యథాతథా, శోభన మాగతం స్వాగతం, స్వాగత
వచనం, ప్రీతః సన్ వ్యాజహార కుశలాగమనం పప్రచ్ఛేత్యర్థః. నాథేన
త్వత్ర ‘ప్రత్యాసన్నే మనసీ’తి సాధీయా నేవ పాఠః కల్పితః. ప్రత్యాసన్నే
ప్రకృతిమాపన్నే సతీ త్యర్థః. యస్తు తేనైవ పూర్వపాఠే విరోధః ప్రదర్శితః.
సోఽస్మాభి రాషాఢస్య ప్రథమదివస, ఇత్యేతత్పాఠవిప్లవసమాధానేనైవ
సమాధాయి.

ధూమజ్యోతిస్సలిలమరుతాం సన్నిపాతః క్వ మేఘః
సందేశార్థాః క్వ పటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః,
ఇత్యౌత్సుక్యాదపరిగణయన్, గుహ్యకస్తం యయాచే
కామార్తా హి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు. 5

టీ. ధూమ జ్యోతి స్సలిలమరుతాం ధూమ = పొగయొక్కయు, జ్యోతి = తేజస్సుయొక్కయు, సలిల = నీటియొక్కయు, మరుతాం = గాలియొక్కయు, సన్నిపాతః = సమూహమగు, మేఘః = మేఘము, క్వ = ఎక్కడ? పటు కరణైః, పటు=సమర్థము లైన, కరణైః = ఇంద్రియములు గల, ప్రాణిభిః =చేతనులచేత, ప్రాపణీయాః = పంపఁ దగిన, సందేశార్థాః; సందేశ=వార్తలయొక్క, అర్థాః=విషయములు, క్వ = ఎక్కడ? ఇతి=ఇట్లు, ఔత్సుక్యాత్ =(తన ప్రియురాలి నెప్పుడు కూడి యుందునా యని?) తహ తహ పడుటవలన, అపరిగణయన్ = ఆలోచించని వాఁడై, గుహ్యకః = యక్షుఁడు, తం = ఆ మేఘుని, యయాచే = (తన ప్రియురాలికి క్షేమము జెప్పి రమ్మని) యాచించెను. కామార్తాః = కామముచేఁ బీడింపఁబడినవారు (మిక్కిలి కామము గలవారు),చేతనా చేతనేషు = చేతనుల విషయమందు నచేతనుల విషయమందును, ప్రకృతి కృపణాః ప్రకృతి=స్వభావముచే, కృపణాః = దీనులు (తెలివి మాలినవారుగదా!), అనఁగా కాముకులు చేతనా చేతన జ్ఞాన శూన్యు లనుట.

తా. ధూమ జ్యోతి స్సలిల మరుత్తుల కలయిక యగు మేఘుఁ డెక్కడ? మనుష్యులు మున్నగు వారిచేఁ బంప నర్హమగువార్త యెక్కడ? ప్రియురాలి యందలి వాత్సల్యముచే నిది గణింపక యక్షుఁడు దన క్షేమవార్తను ప్రియురాలికిఁ జెప్ప మేఘునిఁ బుత్తెంచెను. ఇది యుక్తమే. కారణ మే మనఁగా కాముకులకు యుక్తాయుక్త విచారమును జడ చేతన జ్ఞానమును వారియందు దరుదు.

నను చేతనసాధ్య మర్థం కథ మచేతనేన కారయితుం ప్రవృత్త ఇత్యాక్షేపం కవిః సమాధత్తే ధూమేతి.—ధూమశ్చ జ్యోతిశ్చ సలిలం చ మరుత్ (వాయు) శ్చ తేషాం, సన్నిపాతః, సంఘాతః, మేఘః క్వ, అచేతనత్వాత్సందేశహరణానర్హ ఇత్యర్థః, పటుకరణైః, సమర్థేన్ద్రియైః,

'కరణం సాధకతమ క్షేత్ర గాత్రేన్ద్రియే ష్వపీ' త్యమరః. ప్రాణిభిః చేత నైః 'ప్రాణీ తు చేతనో జన్మీ' త్యమరః. ప్రాపణీయాః ప్రాపయితుం యోగ్యాః, సందిశ్యన్త ఇతి సందేశాః, త ఏవ వార్తాః క్వ, ఇతి ఏవం, ఔత్సుక్యాత్ ఇష్టార్థో ద్యుక్తత్వాత్, 'ఇష్టా ర్థోద్యుక్త ఉత్సుక' ఇత్యమరః. అపరిగణయన్ అవిచారయన్, గుహ్యకః యక్షః, తం మేఘం, యయాచే. తథాహి, కామార్తాః, చేతనా శ్చ అచేతనా శ్చ చేతనాచేతనాః, తేషు విషయే, ప్రకృతి కృపణాః స్వభావ దీనాః, హి, కామార్తానాం యుక్తాయుక్తవివేకశూన్యత్వా దచేతనయాచ్ఞా న విరుధ్యత ఇత్యర్థః. అత్ర మేఘసందేశయోః విరూపయో ర్ఘటనా ద్విరూప ఘటనారూపో విష మాలజ్కారః, తదుక్తం 'విరుద్ధకార్యస్యోత్పత్తి ర్యత్రానర్థస్య వా భవేత్, విరూపఘటనా చాసౌ విషమాలజ్కృతి స్త్రిధే' తి; న చార్థాన్తరన్యా సానుప్రాణిత ఇతి: తత్సమర్థకత్వేనైవ చతుర్థపాదే తస్యోపన్యాసాత్.

జాతం వంశే భువనవిదితే పుష్కలావర్తకానాం
జానామి త్వాం ప్రకృతిపురుషం కామరూపం మఘోనః;
తేనార్థిత్వం త్వయి విధివశాద్దూరబన్ధుర్గతోఽహం
యాచ్ఞా మోఘా వరమధిగుణే నాధమే లబ్ధకామా. 6

టీ. (మేఘుఁడా!) త్వాం=నిన్ను, భువనవిదితే; భువన = లోకముల యందు, విదితే=ప్రసిద్ధ మగు, పుష్కలావర్తకానాం=పుష్కలములు ఆవర్తకము లనెడు మేఘముల యొక్క, వంశే = కులమునందు, జాతం = పుట్టినవానినిగాను, కామరూపం=ఇచ్ఛ వచ్చిన రూపము (ధరించుఁ) గలవానినిగాను, మఘోనః=ఇంద్రునకు, ప్రకృతి పురుషం=ప్రధాన పురుషునిగాను, జానామి=ఎఱుఁగుదును, తేన=ఆ కారణముచే, విధి వశాత్ = దైవ యోగము వలన, దూరబంధుః; దూర=దూర దేశము నందు, బంధుః=బంధుజనము గల, అహం=నేను, త్వయి=నీ యందు, అర్థిత్వం = యాచకత్వ మును, గతః=పొందినవాఁడను, అధిగుణే=గొప్ప గుణములు గలవానియందు,

యాచ్ఞా=యాచన, మోఘా=వ్యర్థమైనను, వరం=ఇంచుక ప్రియమైనది, అధమే=నీచుని యందు, లబ్ధ కామా; లబ్ధ = పొందఁబడిన, కామా =కోరిక గల దైనను, న (వరం)=ఇంచుకంత యుక్తమైనది కాదు.

తా. మేఘుఁడా! నీవు గొప్ప వంశమునందుఁ బుట్టిన వాఁడవు, కామ రూపము గలవాఁడవు, ఇంద్రునకుఁ బ్రధానుఁడవు. ఈ సంగతి నాకుఁ దెలియును. నా బంధువులు దూర దేశమునం దున్నారు. గనుక నిన్ను యాచించు చున్నాను. నీవంటి గొప్పవాని నాశ్రయించుట యుక్తము గాని నీచులను యాచించుట తగదు గదా!

సంప్రతి యాచ్ఞాప్రకార మాహ జాతమితి.—హే మేఘ, త్వాం భువనేషు విదితే (ప్రసిద్ధే) భువనవిదితే *'నిష్ఠే' తి భూతార్థే క్తప్రత్యయః * 'మతిబుద్ధి' త్యాదినా వర్తమానార్థత్వే తు * 'క్తస్య చ వర్తమాన' ఇతి భువనశబ్దస్య షష్ఠ్యన్తనియమాత్ సమాసో న స్యాత్ * 'క్తేన చ పూజాయా మి' తి నిషేధాత్, పుష్కలావర్తకాశ్చ కేచి న్మేఘానాం కూటస్థాః పుష్కలావర్తకా ఇ త్యుచ్యన్తే తేషాం వంశే కులే, జాతం, మహాకులప్రసూత మిత్యర్థః, కామరూపం ఇచ్ఛాధీనవిగ్రహం, దుర్గాదిసంచారక్షమ మిత్యర్థః, మఘోనః ఇన్ద్రస్య, ప్రకృతిపురుషం ప్రధానపురుషం, జానామి, తేన తవ ప్రభుత్వాభిజాత్యాదిగుణయోగిత్వేన హేతునా, విధివశాత్ దైవాయత్తత్వాత్. 'విధి ర్విధానే చే' త్యమరః. 'వశ ఆయత్తతాయాం చ వశ ఇచ్ఛాప్రభేదయో రి' తి విశ్వః, దూరే బన్ధు ర్యస్య సః, దూరబన్ధుః వియుక్తభార్యః, అహం, త్వ య్యర్థిత్వం గతః: నను యాచకస్య యాచ్యగుణోత్కర్షః కుత్రోపయుజ్యత ఇ త్యాశఙ్క్య దైవాద్యాచ్ఞాభఙ్గేఽపి లాఘవదోషాభావ ఏవ ఉపయోగ ఇత్యాహ యాచ్ఞేతి:—తథా హి, అధిగుణే అధికగుణే పుంసి విషయే యాచ్ఞా, మోఘా విఫలాపి, వరం ఈషత్ప్రియం, దాతుర్గుణాఢ్య త్వాత్ ప్రియత్వం, యాచ్ఞా వైఫల్యాదీషత్ప్రియత్వమితి భావః, అధమే నిర్గుణే, యాచ్ఞాతు లబ్ధకామాపి.

న వరమ్ ఈషత్ప్రియ మపి న భవతీ త్యర్థః. 'దైవా ద్వృతే వర శ్శ్రేష్ఠే త్రిషు క్లీబే మనాక్ప్రియే' ఇత్యమరః. అర్థాన్తరన్యాసానుప్రాణితః ప్రేయో*లఙ్కారః, తదుక్తం దణ్డినా 'ప్రేయః ప్రియతరాఖ్యాన' మితి. ఏత చ్చాద్యపాదత్రయే చతుర్థపాదస్థేనార్థాన్తరన్యాసేనోపజీవిత మితి సువ్యక్త మేవ.

సంతప్తానాం త్వమసి శరణం తత్పయోద ప్రియాయా
స్సందేశం మే హర ధనపతి క్రోధవిశ్లేషితస్య,
గన్తవ్యా తే వసతిరలకా నామ యక్షేశ్వరాణాం
బాహ్యోద్యానస్థితహరశిరశ్చన్ద్రికా ధౌతహర్మ్యా. 7

టీ. పయోద = మేఘుఁడా! సంతప్తానాం = (ఎండచేతఁగాని విరహముచేతఁగాని) సంతాపము (తాప) నొందినవారికి, శరణం = రక్షకుండవు, అసి=అగుచున్నావు. తత్ = ఆకారణమువలన, ధనపతి క్రోధ విశ్లేషితస్య; ధనపతి = కుబేరునియొక్క, క్రోధ = కోపముచేత, విశ్లేషితస్య = ఎడఁ బాపఁ బడిన, మే=నాయొక్క; సందేశం = వార్తను, ప్రియాయాః = ప్రియురాలికి, హర = పొందింపుము (చెప్పుము), బాహ్యోద్యానస్థిత హర శిరశ్చంద్రికా ధౌత హర్మ్యా; బాహ్య = వెలుపల నున్న, ఉద్యాన = రాజు తోట యందు, స్థిత = ఉండిన హర=శివుని యొక్క, శిరః = శిరస్సునందలి, చంద్రికా = వెన్నెల చేత, ధౌత = నిర్మలము లయిన, హర్మ్యా = మేడలు గల, అలకానామ=అలకా పట్టణ మని ప్రసిద్ధ మయిన, యక్షేశ్వరాణాం = యక్ష రాజులయొక్క (శ్రేష్ఠులయిన యక్షులయొక్క), వసతిః = స్థానము, తే=నీకు, గన్తవ్యా = పోవఁదగినది.

తా. మేఘుఁడా! నీవు ఎండచేత సంతాపము నొందిన వారిని నుదక మిచ్చి కాపాడు చున్నావు, వియోగము నొందిన వారిని నొకచోటఁ గూర్చి కాపాడుచున్నావు. గనుక కుబేరుఁడు కోపముచే నెడఁబాపఁగా నిక్కడఁ బడి యున్న నా మాట

నా ప్రియురాలికి జెప్పుము. నా ప్రియురా లుండుచోటు అలకా పట్టణము. అది యక్షరాజుల కునికి పట్టు. ఆపట్టణపుఁ దోఁటయందు శివుం డున్నాఁడు. ఆయన శిరంబున ధరించిన చంద్రుని వెన్నెలచేత నాపట్టణంపు మేడలు శుభ్రముగా వెలుంగు చుండును, అక్కడికి నీవు పోవలయును.

సంతప్తానా మితి — హే పయోద జలద, త్వం, సంతప్తానామ్ ఆతపేన ప్రవాసవిరహజేన తాపేన చ సంజ్వరితానాం. 'సంతాప స్సంజ్వర స్సమా' విత్యమరః. శరణమ్ ఆతపఖిన్నానాం పయోదానేన ప్రోషితానాం స్వస్థానప్రణయనేన చ రక్షితాసి, 'శరణం గృహరక్షిత్రోః' ఇత్యమరః. తత్ తస్మాత్కారణాత్, ధనపతేః కుబేరస్య, క్రోధేన, విశ్లేషితస్య ప్రియయా వియోజితస్య. మే మమ, సందేశం వార్తాం ప్రియాయాః హర ప్రియాం ప్రతి నయేత్యర్థః * సంబన్ధ సామాన్యే షష్ఠీ, సందేశహరణే నావయో స్సంతాపం నుదేత్యర్థః; కుత్ర స్థానే సా స్థితా? తత్స్థానస్య వా కిం వ్యావర్తకమ్? తత్రాహ గన్తవ్యేతి:— బహి ర్భవం బాహ్యం * 'బహిర్దేవ పఞ్చ జనేభ్య శ్చే తి వక్తవ్య మి'తి ఇఞ్ప్రత్యయః, బాహ్యోద్యానే స్థితస్య హరస్య శిరసి యా చన్ద్రికా తయా ధౌతాని (నిర్మలాని) హర్మ్యాణి (ధనికభవనాని) యస్యాం సా తథోక్తా. 'హర్మ్యాది ర్ధనినాం వాస' ఇత్యమరః. అనేన వ్యావర్తకముక్తం, అలకా నామ అలకేతి ప్రసిద్ధా, యక్షేశ్వరాణాం, వసతిః స్థానం తే తవ, గన్తవ్యా, త్వయా గన్తవ్యేత్యర్థః *'కృత్యానాం కర్తరి వే'తి షష్ఠీ.

త్వామారూఢం పవనపదవీముద్గృహీతాలకాన్తాః
ప్రేక్షిష్యన్తే పథికవనితాః ప్రత్యయాదాశ్వసన్త్యః,
కః సన్నద్ధే విరహవిధురాం త్వయ్యుపేక్షేత జాయాం
న స్యాదన్యోఽప్యహమివ జనో యః పరాధీనవృత్తిః? 8

అవతారిక. నా పనికిఁ బోవు నపుడు మఱియొక లాభము గలుగు నను చున్నాఁడు.—

టీ. పవన పదవీం=ఆకాశమును, ఆరూఢం = ఎక్కినవ, త్వాం=నిన్ను, పథిక వనితాః = బాటసారుల స్త్రీలు, (అనఁగా తమ పురుషులు దూర దేశములకుఁ బోయినందున నింట నుండి విరహతాపము నొందుచుండిన స్త్రీలు), ప్రత్యయాత్ = నిన్నుఁ జూడఁగనే తమ ప్రియులు వత్తు రను నమ్మకము వలన, ఆశ్వసన్తః = ఊరడిల్లు చున్నవారై ఉద్గృహీతాలకాంతాః; ఉద్గృహీత = ఎత్తి పట్టుకొనఁ బడిన, అలకాంతాః = ముంగురుల కొనలు గలవారై, ప్రేక్షిష్యంతే = చూడఁ గలరు, త్వయి = నీవు, సన్నద్ధే = ప్రయత్న పడినవాఁడ వగుచుండఁగా, విరహ విధురాం; విరహ = ఎడఁబాయుటచేత, విధురాం=మనస్సునఁ గలఁకఁ జెందిన, జాయాం = ప్రియురాలిని, కః=ఎవఁడు, ఉపేక్షేత = ఒప్పరికించును, అన్యోఽపి నాకంటె) ఇతరుఁడును, మాః జనః = ఏ జనుఁడు, అహమివ = నావలె, పరాధీనవృత్తిః = ఇతరాధీన మైన జీవిక గలవాఁడు (అనఁగా స్వతంత్రుఁడు కానివాఁడు), న స్యాత్ = ఉండఁడో.

తా. నీవు నాపనికొఱకు ఆకాశమునఁ బోవుచుండఁగా విరహము నొందిన స్త్రీలు ముంగురులు పై కెత్తి నిన్నుఁ జూచి యిఁక తమ ప్రియులు తమ యొద్దకు వత్తు రని నమ్ముదురు. అప్పుడు వారి విరహ తాపము కొంత తగ్గును గనుక అట్టి సుకృతమును నీకుఁ గలుగును. నీవు వ్యాపించుచుండఁగా విరహముచే వ్యాకుల పడుచున్న ప్రియురాలి నెవ్వఁడు నుపేక్షింపఁడు, నే నొక్కఁడనుఁ మాత్రము స్వాతంత్ర్యము లేక పడి యున్నాను.

మదర్థం ప్రవృత్తస్య తవ పథికాఙ్గనాశ్వాసన మానుషఙ్గికఫల మి త్యాహ—త్వా మితి. పవన పదవీం ఆకాశం, ఆరూఢం త్వాం,

పన్థానం గచ్ఛన్తీతి పథికాః, * 'పథః ష్కన్' ఇతి ష్కన్ ప్రత్యయః, తేషాం వనితాః ప్రోషితభర్తృకాః, ప్రత్యయాత్ ప్రియాగమన విశ్వాసాత్. 'ప్రత్యయోఽధీన శపథజ్ఞాన విశ్వాసహేతు ష్వి' త్యమరః. ఆశ్వసన్త్యో విశ్వసితాః, శ్వసిధాతో శ్శతృప్రత్యయాన్తాత్ *'ఉగిత శ్చే'తి జీప్ తథా, ఉద్గృహీతాలకాన్తాః దృష్టిప్రసారార్థ మున్నమయ్య ధృతాలకాగ్రాః సన్త్యః, ప్రేక్షిష్యన్తే అత్యుత్కణ్ఠయా ద్రక్ష్యన్తీత్యర్థః. మదాగమనేన పథికాః కథ మాగమిష్యన్తీ త్యత్రాహ—కథాహి, త్వయి, సన్నద్ధే వ్యాపృతే సతి, విరహేణ విధురాం (వివశాం), జాయాం, కః ఉపేక్షేత న కోఽప్యుపేక్షేత్యర్థః, అన్యోఽపి మద్వ్యతిరిక్తోఽపి, యో జనః, అహ మివ, పరాధీన వృత్తిః పరాయత్తజీవికో న స్యాత్, స్వతన్త్ర స్తు న కోఽప్యుపేక్షేతే త్యర్థః. అర్థాన్తరన్యాసోఽలఙ్కారః. తదుక్తం * 'కార్యకారణసామాన్య విశేషాణాం పరస్పరం, సమర్థనం యత్ర సోఽర్థాన్తరన్యాస ఉదాహృత' ఇతి.

మన్దంమన్దం నుదతి పవనశ్చానుకూలో యథా త్వాం
వామశ్చాయం నదతి మధురం చాతక స్తే సగన్ధః,
గర్భాధానక్షణపరిచయాన్నూనమాబద్ధమాలాః
సేవిష్యన్తే నయనసుభగం ఖే భవన్తం బలాకాః. (!)

ఆవతారిక. శుభ శకునము లగుచున్నవి. కార్యసిద్ధి యగు ననుచున్నాఁడు.—

టీ. అనుకూలః = నిన్ననుసరించి వచ్చునట్టి, పవనః = వాయువు, త్వాం = నిన్ను, మందం మందం మిక్కిలి తిన్నఁగా, యథా = (కార్యసిద్ధికిఁ) దగినట్లు, నుదతి = త్రోయుచున్నాఁడు (ప్రేరేపించుచున్నాఁడు), సగంధః = (నీకు) సంబంధము గల, తే=నీకు, వామః=ఎడమతట్టున నున్న, అయుం చాతక శ్చ = ఈ కనుపడుచున్న చాతక పక్షియు, మధురం=వినసొంపుగా, నదతి = పలుకు చున్నది. ఈ రెండు శుభ శకునము లిప్పు డగు

చున్నవి. మఱియును, శుభశకునమును కాఁగల దను చున్నాఁడు) గర్భాధాన క్షణ పరిచయాత్: గర్భ = గర్భము నందు జంతువును, ఆధాన = ఉంచుట యను, క్షణ = ఉత్సవము నందలి, పరిచయాత్ = అభ్యాసమువలన, ఖే = ఆకాశమునందు, ఆబద్ధ మాలాః; ఆబద్ధ = అంతనుఁ గట్టఁ బడిన, మాలాః= పంక్తులు గల, బలాకాః = ఆఁడు కొక్కెరలు, నయన సుభగం = కన్నుల కింపగు, భవంతం = నిన్ను, నూనం = తప్పక, సేవిష్యంతే = సేవింపఁగలవు.

తా. మేఘుఁడా! నీ కనుకూలముగా గాలి వీచుఁ చున్నది. చాతకపక్షి మధురముగాఁ బలుకుచున్నది. కొక్కెర పక్షులును నిన్ను సంతోషముగా సేవింపఁగలవు.

నిమిత్తాన్యపి తే శుభాని దృశ్యన్త ఇత్యాహ—మన్దంమన్దమితి. అనుకూలః, పవనో వాయు శ్చ, త్వా౽, మన్దంమన్దమ్ అతిమన్ద మిత్యర్థః. * అత్ర కథఞ్చి ద్వీప్సాయా మేవ ద్విరుక్తి ర్నిర్వాహ్యా * 'ప్రకారే గుణ వచన స్యే'తి ఇదాశ యణే కర్మధారయవద్భావేన సుబ్లుకి మన్దమన్ద మితి స్యాత్, త దేవ వామనః, మన్దంమన్ద మిత్యత్ర న ప్రకారార్థ ఇతి ద్విర్భావ' ఇతి, యథా సదృశం, భావిఫలానురూప మిత్యర్థః 'యథా సా దృశ్యే యోగ్యతావీప్సా స్వ ర్థానతిక్రమ' ఇతి యాదవః, నదతి ప్రేర యతి, ఆయం, సగన్ధః సగర్వః—సంబన్ధీ తి కేచిత్ * 'గన్ధో గన్ధక ఆమో దే లేశే సంబన్ధగర్వయో రి' త్యుభయత్రాపి విశ్వప్రకాశః, తే తవ, వామో వామభాగస్థః. 'వామస్తు వక్రే రమ్యే స్యాత్సవ్యే వామస్థితేఽపి చే'తి శబ్దార్ణవే. చాతకః పక్షివిశేషశ్చ మధురం శ్రావ్యం, నదతి వ్యా హరతి; ఇదం నిమిత్తద్వయం వర్తతే, వర్తిష్యతే చాపరం నిమిత్త మిత్యాహ గర్భేతి.—గర్భః కుక్షిస్థజన్తుః. 'గర్భోఽపవరకేఽన్నేఽగ్నౌ సుతే పనస కంటకే. కుక్షౌ కుక్షిస్థజన్తా చే'తి యాదవః తస్యాధాన ముత్పాద నం త దేవ క్షణః ఉత్సవః, సుఖ హేతుత్వాదితి భావః. 'నిర్వ్యాపార స్థితౌ కాలవిశేషోత్సవయోః క్షణ'ఇ త్యమరః. తస్మిన్పరిచయా దభ్యా

సాద్ధేతోః, ఖే వ్యోమ్ని. ఆబద్ధమాలాః గర్భాధానసుఖార్థం తత్సమీపే బద్ధపఙ్క్తయ ఇత్యర్థః, ఉక్తం చ కర్ణోదయే. 'గర్భం బలాకా దధతేఽభ్రయోగా న్నాకే నిబద్ధావళయ స్సమన్తా ది' తి. బలాకాః బలాకాఙ్గనాః, నయనసుభగం దృష్టిప్రియం, భవన్తం, నూనం సత్యం, సేవిష్యన్తే. అనుకూలవాత చాతకరుత బలాకాదర్శనానాం శుభసూచకత్వం శకునశాస్త్రే దృష్టమ్; తత్తు విస్తరభయాన్న లిఖితమ్.

తాం చావశ్యం దివసగణనాతత్పరా మేకపత్నీ
మవ్యాపన్నా మవిహతగతిర్ద్రక్ష్యసి భ్రాతృజాయామ్,
ఆశాబన్ధః కుసుమసదృశం ప్రాయశో హ్యఙ్గనానాం
సద్యః పాతి ప్రణయి హృదయం విప్రయోగే రుణద్ధి. 10

టీ. దివస గణనా తత్పరాం; దివస=దినములను, గణనా = ఎంచుటయందు. తత్పరాం = ఆసక్తురాలైనది గనుకనే, అవ్యాపన్నాం=(శాపాంతము నందు నేను వత్తునను నట్టి యాశ చేత) ఆపదను బొందనిదియు, ఏక పత్నీం = పతివ్రత యైనది యు, భ్రాతృ జాయాం = నీకు సోదరుఁడ నగు నా యొక్క భార్యయైన (నీకు వదిన యగు) ఇచ్చట నన్నభార్య యనుటవలన గురుపత్నీ శ్వశురపత్నీ భ్రాతృపత్నీ పితృపత్నీ రక్షక పత్నీ యను నైదుగురును సమానులగుటచే శంకలేక చూడ వచ్చు నని యభిప్రాయము), తాం=ఆ ప్రియురాలిని, అవిహతగతిః; అవిహత = వ్యర్థముగాని, గతిః=గమనము గలవాఁడవై; అవశ్యం=తప్పక, ద్రక్ష్యసి = చూడఁగలవు, ఆశా = మిక్కిలి ప్రేమ యనెడు బంధః = తొడిమ, ప్రణయి = ప్రేమగలది గనుకనే, కుసుమసదృశం = పుష్పముతో సమాన మైనది గనుకనే, విప్రయోగే=వియోగమునందు, సద్యః = ఇప్పుడు, పాతి=జారి పడు నట్టి, అంగనానాం=స్త్రీలయొక్క, హృదయం=జీవితమును, ప్రాయశః = తరుచుగా, రుణద్ధి = ఆడ్డగించు చున్నది.

తా. అతి ప్రేమ గలిగిన స్త్రీల బ్రతుకు సుకుమారమై యుండును. ప్రియుల నెడఁబాసి రేని వదలి పోవునదియై యుం

డును. అట్టి జీవితము ప్రియ సమాగమ మందలి యాసచే నిలచి యుండును గదా! అటుల పతివ్రత యగు నా ప్రియురాలును నేను వచ్చుట కేఁక నెన్ని దినము లున్నవో యని యెన్నుచుఁ బ్రాణము ధరించి యుండును. మన మిద్దఱము సోదర భావము గలవారముగావున నీకు వదినె యైనది నీకుఁ దల్లితో సమాను రాలు, నీవు పోయి చూచుట కడ్డము లేదు.

న చ తస్యా నాశాద్వ్రతస్ఖలనాద్వా నిష్ఫల స్తేఽప యాన ఇత్యాహ— తాం చేతి. హే మేఘ, దివసానాం అవశిష్టదినానాం, గణనాయాం సంఖ్యానే, తత్పరామ్ ఆసక్తాం, 'తత్పరే ప్రసితాసక్తా' విత్యమరః. అత ఏవ, అవ్యాపన్నామ్ అమృతాం, శాపావసానే మదాగమన ప్రత్యాశయా జీవ న్తీ మిత్యర్థః. ఏకః పతి ర్యస్యా స్తా మేకపత్నీమ్ పతివ్రతామిత్యర్థః. * నిత్యం సపత్న్యాదిషు ఇతి ఙీప్ నకారశ్చ, భ్రాతు (ర్మే) జాయాం భ్రాతృజాయాం, మాతృసన్నికృష్టం దర్శనీయా మిత్యాశయః తాం మత్ప్రియాం అవిహతగతిః సఫలగమనస్సన్, ద్రక్ష్యసి ఆలోకయిష్యసి; తథాహి, ఆశా అతితృష్ణా 'ఆశాదిగతితృష్ణయో' రితి విశ్వః. బధ్యతే అనేనేతి బన్ధః బన్ధనం వృన్తమితి యావత్, ఆశైవ బన్ధః ఆశాబన్ధః—కర్తా, ప్రణయి ప్రేమయుక్తం, అత ఏవ, కుసుమసదృశం కుసుమసుకుమార మిత్యర్థః. అత ఏవ విప్రయోగే వియోగే. సద్యఃపాతి సద్యో భ్రంశనశీలం. అఙ్గనానాం, హృదయం జీవితం 'హృదయం జీవితే చిత్తే వక్షస్యాకూత వృక్కయో' రితి శబ్దార్ణవే. ప్రాయశః ప్రాయేణ, రుణద్ధి ప్రతిబధ్నాతీత్యర్థాన్తరన్యాసః.

కర్తుం యచ్చ ప్రభవతి మహీముచ్ఛిలీన్ధ్రామవన్ధ్యాం
తచ్ఛ్రుత్వా తే శ్రవణసుభగం గర్జితం మానసోత్కాః,
ఆ కైలాసాద్బిసకిసలయచ్ఛేదపాథేయవన్తః
సంపత్స్యన్తే నభసి భవతో రాజహంసాః సహాయాః.	11

అవ. నీకు మార్గమున సహాయ సంపత్తియుం గల దనుచున్నాఁడు.—

టీ. యత్=ఏ యుఱుము మహీం=భూమిని, ఉచ్ఛిలీన్ధ్రామ్ = మొలచిన పుట్టగొడుగులు గలది గనుకనే, అవంధ్యాం = ఫలముగల దానిగా, కర్తుం = చేయుటకును ప్రభవతి=సమర్థ మగునో, తత్=అట్టి, శ్రవణ సుభగం=చెవులకింపైన, తే=నీయొక్క, గర్జితం=ఉఱుమును, శ్రుత్వా = విని, మానసోత్కాః = మానస సరస్సునందు ఉత్కంఠ (ఎప్పు డెప్పుడు పోయి చేరుదు మో యని వేగిరపాటు) గలవై, బిసకిసలయ చ్ఛేద పాథేయవన్తః; బిస = తామర తూఁడుల యొక్క, కిసలయ = కొనల యొక్క, ఛేద=ముక్కలచేత, పాథేయవన్తః = దారి బత్తెము గలవి యగు, రాజహంసాః = రాజహంసలు, నభసి = ఆకాశమునందు, భవతః = నీకు, ఆకైలాసాత్ = కైలాసపర్వతము వఱకు, సహాయాః=కూడా వచ్చువారు గా, సంపత్స్యంతే = కాఁగలవు.

తా. భూమిని శిలీంధ్రములు మొలచుటచే సఫలమైన దానినిఁ గా చేయుఁ నట్టిదియు వినుటకు సొంపైనదియు నగు నీ యుఱుమును విని రాజహంసలు లేఁత తామర తూండ్లముక్కలను దారిబత్తెముగాఁ జేసికొని కైలాసపర్వతము దనుక నీకు సహాయులై రాఁగలవు.

కర్తుమితి.—యద్గర్జితం కర్తృ, మహీం, ఉచ్ఛిలీన్ధ్రామ్ ఉద్భూత కన్దలికాం 'కన్దల్యాం చ శిలీన్ధ్రః స్యాత్' ఇతి శబ్దార్ణవే అత ఏవ, అవన్ధ్యాం సఫలాం, కర్తుం, ప్రభవతి శక్నోతి, శిలీన్ధ్రాణాం భావిసస్యసంపత్తి సూచకత్వాదితి భావః, తదుక్తం నిమిత్తనిదానే, 'కాలాభ్రయోగా దుదితాః శిలీన్ధ్రాః సంపన్నసస్యాం కథయన్తి ధాత్రీమ్' ఇతి. తత్ శ్రుత్వా, మానసోత్కాః మానసే సరస్యుత్మనసః ఉత్సుకా ఇతియావత్ * 'ఉత్క ఉన్మనాః' ఇతి. నిపాతనాత్సాధుః, కాలాన్తరే మానసస్య హిమదుష్టత్వా ద్ధిమస్య చ హంసానాం రోగహేతుత్వా దన్యత్ర గతా హంసాః పున ర్వర్షాసు

మానస మేవ గచ్ఛన్తీతి ప్రసిద్ధిః, బిసకిసలయానాం మృణాళాగ్రాణాం ఛేదైః శకలైః, పాథేయం పథి సాధు పాథేయం పథి భోజ్యమ్ * పథ్యతిథివసతిపతేర్ఢఞ్. తద్వన్తః మృణాళాగ్రశకలసమ్బలవన్త ఇత్యర్థః. రాజహంసాః హంసవిశేషాః 'రాజహంసాస్తు తే చఞ్చు చరణై ర్లోహితైః సితాః' ఇత్యమరః. నభసి వ్యోమ్ని. భవతః తవ, ఆ కైలాసాత్ కైలాస పర్యన్తమ్* పదద్వయం చైత్యాత్, సహాయాః సయాత్రాః 'సహాయస్తు సయాత్రః స్యాత్' శబ్దార్ణవే. సంపత్స్యన్తే భవిష్యన్తి.

ఆపృచ్ఛస్వ ప్రియసఖమముం తుఙ్గమాలిఙ్గ్య శైలం
వన్ద్యైః పుంసాం రఘుపతిపదై రఙ్కితం మేఖలాసు,
కాలే కాలే భవతి భవతా యస్య సంయోగమేత్య
స్నేహవ్యక్తిశ్చిరవిరహజం ముఞ్చతో బాష్పముష్ణమ్. 12

టీ. ప్రియ సఖం = ప్రేమగల చెలికాఁడైన వాఁడును, తుంగం = ఉన్నతుఁడైన వాఁడును, పుంసాం = చేతనులకు, వన్ద్యైః = నమస్కరింపఁదగిన, రఘుపతి పదైః, రఘుపతి= శ్రీరామునియొక్క, పదైః = పాదములచేత, మేఖలాసు = కొండ నడిమి ప్రదేశములయందు. అంకితం = చిహ్నముగల వాఁడును నగు, అముం శైలం = ఈ చిత్రకూట పర్వతమును, ఆలిఙ్గ్య = కౌఁగిలించుకొని, ఆపృచ్ఛస్వ = వేఁడు కొనుము, కాలేకాలే= ప్రతివర్షాకాల మందునను, (సఖుఁడవైన నీతోఁడఁ గూడినప్పు డెల్లను,) భవతా = నీతోడ, సంయోగం=కూడికను, ఏత్య=పొంది, చిర విరహ జం = చాల కాల మెడఁబాసి యుండుటవలనఁ బుట్టిన, ఉష్ణం = వేఁడియగు, బాష్పం = ఆవిరిని (కన్నీటిని) ముంచతః = విడుచుచున్న, యస్య = ఏ పర్వతము యొక్క, స్నేహ వ్యక్తిః = ప్రేమావిర్భావము, భవతి = కలుగుచున్నదో.

తా. ఈ చిత్రకూటము నీకు మిత్రుఁడు, శ్రీరామమూర్తి పాదారవింద స్పర్శచే పరమపవిత్రుఁడు, స్వభావముచే గొప్ప వాఁడు, నీవు వచ్చినప్పుడు ఆనందించువాఁడు గనుక యితని

నాలింగనముఁ జేసి కొని పోయి వచ్చెద నని మర్యాదగా వీడుకొనుము.

ఆపృచ్ఛస్వేతి:—ప్రియం సఖాయం ప్రియసఖం, * 'రాజాహః సఖిభ్యష్టచ్' ఇతి టచ్ సమాసాన్తః. తుఙ్గమ్ ఉన్నతం పుంసాం వన్ద్యైః ఆరాధనీయైః. రఘుపతిపదైః రామపాదన్యాసైః. మేఖలాసు కటకేషు, 'అథ మేఖలా శ్రోణీస్థానేఽద్రికటకే కటిబన్ధేభబన్ధనే' ఇతి యాదవః. అఙ్కితం చిహ్నితమ్. ఇత్థం సఖిత్వాన్మహత్త్వా త్పవిత్రత్వాచ్చ సంభావనార్హామ్, అముం శైలం చిత్రకూటాద్రిమ్. ఆలిఙ్గ్య. అపృచ్ఛస్వ సాధో యామీత్యామన్త్రణేన సభాజయ, 'ఆమన్త్రణసభాజనే, అపృచ్ఛనం' ఇత్యమరః. * 'ఆఙి నుప్రచ్ఛ్యో రుపసంఖ్యానం, ఇత్యాత్మనేపదమ్. సఖిత్వం నిర్వాహయతి, కాలఇతి—కాలేకాలే = ప్రతిప్రావృట్ కాలం సుహృత్సమాగమనకాలశ్చ కాలశబ్దేనోచ్యతే * వీప్సాయాం ద్విరుక్తిః, భవతా, సంయోగం సంపర్కం. ఏత్య, చిరవిరహజం, ఉష్ణం. బాష్పమ్ ఊష్మాణం నేత్రజలం చ, 'బాష్పో నేత్రజలోష్మణోః' ఇతి విశ్వః. ముఞ్చతో, యస్య శైలస్య, స్నేహవ్యక్తిః ప్రేమావిర్భావః, భవతి, స్నిగ్ధానాం హి చిరవిరహసంగతానాం బాష్పపాతో భవతీతి భావః.

సంప్రతి తస్య మార్గం కథయతి.—

మార్గం తావచ్ఛృణు కథయత స్త్వత్ప్రయాణానురూపం
సందేశం మే తదను జలద శ్రోష్యసి శ్రోత్రపేయం,
ఖిన్నః ఖిన్నః శిఖరిషు పదం న్యస్య గన్తాసి యత్ర
క్షీణః క్షీణః పరిలఘు పయః స్రోతసాం చోపభుజ్య. 13

టీ. జలద = మేఘుడా! తావత్ = ఇప్పుడు, కథయతః = చెప్పుచున్న, (మత్తః = నావలన), త్వత్ప్రయాణానురూపం; త్వత్ = నీ యొక్క, ప్రయాణ=ప్రయాణమునకు,అనురూపం=తగిన, మార్గం=త్రోవను, శృణు = వినుము, తదను = పిమ్మట, శ్రోత్రపేయం = చెవులచేతఁ ద్రావఁ

దగిన (అనఁగా మిక్కిలి యాసచే వినఁ దగిన), మఱియు నేను చెప్పఁ బోవు సందేశమును వినువారికి నమృతము ద్రావిన ట్లానందము గలుగు నను నర్థము, "పేయం" అను పదముచేఁ దె యఁబడుచున్నది. మే = నాయొక్క, సందేశం=సమాచారమును, శ్రోష్యసి = వినగలఁవు, యత్ర = ఏ మార్గమునందు, ఖిన్నః ఖిన్నః=మిక్కిలి శ్రమపడిన వాఁడవై, శిఖరిషు = పర్వతములందు, పదం=అడుగును, న్యస్యచ = ఉంచియు, క్షీణః క్షీణః = మిక్కిలి చిక్కిపోయిన వాఁడవై, స్రోతసాం = నదుల యొక్క, పరిలఘు = మిక్కిలి తేలికయిన, పయః = ఉదకమును, ఉపభుజ్య = ఉపయోగించుకొనియు (త్రాగియు), గంతాసి = పోవం గలవు.

తా. మేఘుఁడా! నేను నీకు ముందు పోవుటకుఁ దగిన మార్గమును చెప్పి తరువాత వినుట కింపైన సమాచారమును చెప్పెదను వినుము. నేను చెప్పఁ బోవు నట్టి మార్గమున నీకు శ్రమ గలిగినప్పుడు పర్వతముల మీఁద నిలచి పోవచ్చును గనుక నీ కామార్గము హితముగా నుండును.

మార్గమితి— హే జలద, తావత్ ఇదానీం కథయతః మత్త ఇత శేషః, త్వత్ప్రయాణస్య, అనురూపమ్ అనుకూలం, మార్గం అధ్వానం 'మార్గో మృగమదే మాసే సౌమ్యర్క్షేఽన్వేషణేఽధ్వని' ఇతి యాదవః. శృణు, తదను మార్గశ్రవణానన్తరం, శ్రోత్రాభ్యాం, పేయం పానార్హం, అతితృష్ణయా శ్రోతవ్యమిత్యర్థః. పేయగ్రహణాత్సందేశస్యామృతసామ్యం గమ్యతే. మే, సందేశం వాచికం, 'సందేశవాగ్వాచికం స్యాత్' ఇత్యమరః. శ్రోష్యసి. యత్ర మార్గే, ఖిన్నః ఖిన్నః, అభీక్ష్ణం క్షీణబలః సన్ * నిత్యవీప్సయోః ఇతి నిత్యార్థే ద్విర్భావః. శిఖరిషు, పర్వతేషు, పదం, న్యస్య నిక్షిప్య, పునర్బలలాభార్థం క్వచిద్విశ్రమ్యేత్యర్థః, క్షీణః క్షీణః అభీక్ష్ణం కృశాఙ్గః సన్ * అత్రాపి కృదన్తత్వా త్పూర్వవ ద్ద్విరుక్తిః. స్రోతసాం, పరిలఘు గురుత్వదోషరహితమ్. ఉపలాస్ఫాలనభేదితత్వాత్పథ్యమి

త్యర్థః, యథా చ వాగ్భటః—'ఉపలాస్ఫాలనక్షేపవిచ్ఛేదైః ఖేదితోదకాః, హిమవన్మలయోద్భూతాః పథ్యా నద్యో భవన్త్యమూః' ఇతి. పయః పానీయం ఉపభుజ్య శరీరపోషణార్థ మభ్యవహృత్య చ, గన్తాసి గమిష్యసి * గమే ర్లుట్.

అద్రేః శృఙ్గం హరతి పవనః కిం స్విదిత్యున్ముఖీభి
ర్దృష్టోత్సాహశ్చకితచకితం ముగ్ధసిద్ధాఙ్గనాభిః,
స్థానాదస్మాత్సరసనిచులాదుత్పతో దఙ్ముఖః ఖం
దిఙ్నాగానాం పథి పరిహరన్ స్థూలహస్తావలేపాన్. 14

టీ. పవనః=వాయువు, అద్రేః=(చిత్రకూట) పర్వతము యొక్క, శృఙ్గమ్ శిఖరమును, హరతి కిం స్విత్ = తీసికొని పోవు చున్నాఁడో యని యెంచి, ఉన్ముఖీభిః = ఎత్తఁబడిన ముఖములు గల, ముగ్ధసిద్ధాఙ్గనాభిః; ముగ్ధ = తెలియని వారగు, సిద్ధాఙ్గనాభిః = సిద్ధస్త్రీల చేత, చకిత చకితం = భయము కలుగు నట్లుగా, దృష్టోత్సాహః; దృష్ట=చూడఁ బడిన, ఉత్సాహః=సంరంభము గలవాఁడవై సరస నిచులాత్; సరస = పచ్చివి యగు, నిచులాత్=ప్రబ్బలి చెట్లుగల, అస్మాత్ స్థానాత్ = ఇచ్చోటు నుండి, దిఙ్నాగానాం = దిగ్గజముల యొక్క, స్థూలహస్తావలేపాన్: స్థూల = లావైన, హస్త = తొండముల యొక్క, అవలేపాన్ = విసరుటలను, పరిహరన్ = త్రోసివేయుచున్నవాఁడవై. ఉదఙ్ముఖః = ఉత్తరపు తట్టు మళ్లిన వాఁడవై, ఖం = ఆకాశమును గూర్చి, ఉత్పత = ఎగురుము.

తా. మేఘుఁడా! నీవు లేచి పోవు నపుడు ముగుదలగు సిద్ధుల వనితలు గాలిలోఁ గొండ కొట్టుకొని వచ్చుచున్న దేమో యని భయపడి చూచెదరు, అప్పుడు వారి బెదరుచూపులు నీకు వేడుక గలిగించును. చల్లని ప్రబ్బలి చెట్లుగల యిక్కడి నుండి లేచి ఉత్తరముఖముగాఁ బ్రయాణమై దిగ్గజములు తొండములు సాచె నేని వానినిఁ ద్రోయుచు పోవలసినది.

పైశ్లోకమున కింకొక యర్థము.

టీ. సరస నిచుళాత్; సరస = రసికుఁడైన నిచుళాత్ = నిచుళుఁడను (కాళిదాసునికి సహాధ్యాయి యై కాళిదాసు రచించిన ప్రబంధముల యం దితరు లారోపించిన దోషములను బరిహరించు నట్టి) కవీశ్వరుఁడు గల అస్మాత్ స్థానాత్ = ఈస్థలమునుండి, ఉదఙ్ముఖః = (ప్రబంధమునందు దోషములు లేవు గనుక ధైర్యముగా) ఎత్తఁబడిన మోము గలవాఁడవై, పథి=మార్గమునందు, దిఙ్నాగానాం = దిఙ్నాగుండను (కాళిదాసు విరోధి యగు, పండితుని యొక్క, స్థూల హస్తా వలేపాన్; స్థూల = లావైన, హస్త=హస్తములఁ ద్రిప్పుచుఁ దెల్పు నట్టి, అవలేపాన్ = దూషణములను (తిట్లను), పరిహరన్ = నివారించుచున్నవాఁడవై, అద్రేః = కొండవలె గొప్పవాఁడగు దిఙ్నాగాచార్యుని యొక్క, శృఙ్గమ్ = ప్రాధాన్యమును (శ్రేష్ఠత్వమును), హరతీతి = బోఁగొట్టు చున్నాఁడనే కారణమును బట్టి, ముగ్ధ సిద్ధాంగనాభిః; ముగ్ధ=సుందరులైన, సిద్ధ=సారస్వతము నందు సిద్ధి గల (సకలవిద్యా పరిపూర్ణులైన) కవులచేతను, అంగనాభిః = స్త్రీలచేతను, దృష్టోత్సాహః; దృష్ట = చూడఁ బడిన, ఉత్సాహః = ఉత్సాహము గల వాఁడ వై, ఖం=ఆకసమునుఁ గూర్చి, ఉత్పత=ఎగురుము.

తా. అనఁగా నీ శ్లోకమునందుఁ గాళిదాసుఁడు తనలోఁ దా ననుకొనినట్లు గాని తన ప్రబంధమునుఁ గూర్చిగాని చెప్పిన ట్లర్థాంతరము స్ఫురించు చున్నది.

ఎట్లనఁగా నిచుళుఁడను కవియుండఁగా మన గ్రంథములయందు దోషము లారోపించువారు లేరు గనుక ధైర్యముగా తరల వచ్చును. మార్గమున దిఙ్నాగాచార్యుఁడు చెప్పుదోషముల నిరాకరించుచు నతని ప్రాధాన్యమును బోఁగొట్టు చున్నందు వలన విద్వాంసులును స్త్రీలును నీ యుత్సాహముఁ జూచు నట్లుగాఁ బ్రసిద్ధిని బొంది యుండు మని తాత్పర్యము.

అద్రేరితి. పవనః వాయుః, అద్రేః చిత్రకూటస్య, శృఙ్గం హరతి కింస్విత్ * కింస్విచ్ఛబ్దో వితర్కార్థే చాదిషు పఠితః, ఇతి శఙ్కయా, ఉన్ముఖీభిః ఉన్నతముఖీభిః * స్వాఙ్గా చ్చోపసర్జనా దసంయోగోపధాత్ ఇతి జీష్, ముగ్ధాభిః మూఢాభిః, 'ముగ్ధః సుందరమూఢయోః' ఇత్యమరః. సిద్ధానాం దేవయోనివిశేషాణాం అఙ్గనాభిః, చకితచకితం చకితప్రకారం యథాతథా * 'ప్రకారే గుణవచనస్య' ఇతి ద్విర్భావః, దృష్టోత్సాహః సన్, సరసాః ఆర్ద్రాః, నిచులాః స్థలవేతసాః, యస్మిం స్తస్మాత్, 'వానీరే కవిభేదే స్యా న్నిచులః స్థలవేతసే' ఇతి శబ్దార్ణవే. అస్మా త్స్థానాత్ ఆశ్రమాత్, పథి నభోమార్గే, దిఙ్నాగానాం దిగ్గజానాం, స్థూలా యే హస్తాః కరాః, తేషాం, అవలేపాన్=ఆక్షేపాన్. పరిహరన్, 'హస్తో నక్షత్రభేదే స్యా త్కరేభకరయో రపి' ఇతి విశ్వః. ఉదఙ్ముఖః సన్ అలకాయా ఉదీచ్యత్వా దిత్యాశయః ఖమ్ ఆకాశం, ఉత్పత ఉద్గచ్ఛ; అత్రేద మప్యర్థాన్తరం ధ్వనయతి.—రసికో నిచులో నామ మహాకవిః కాళిదాసస్య సహాధ్యాయః పరాపాదితానాం కాళిదాసప్రబన్ధదూషణానాం పరిహర్తా యస్మిన్ స్థానే తస్మా త్స్థానా దుదఙ్ముఖో నిర్దోషత్వా దున్నతముఖః సన్ పథి సారస్వతమార్గే దిఙ్నాగానామ్ * పూజాయాం బహువచనం, దిఙ్నాగాచార్యస్య కాళిదాసప్రతిపక్షస్య. హస్తావలేపాన్ హస్తవిన్యాసపూర్వకాణి దూషణాని, పరిహరన్, 'అవలేప స్తు గర్వే స్యా ల్లేపనే దూషణేఽపి చ' ఇతి విశ్వః. అద్రేః అద్రికల్పస్య దిఙ్నాగాచార్యస్య, 'శృఙ్గం ప్రాధాన్యసాన్వోశ్చ' ఇత్యమరః. హరతీతి హేతునా, సిద్ధైః, సారస్వతసిద్ధైః, మహాకవిభిః, అఙ్గనాభిః స్త్రీభిశ్చ, దృష్టోత్సాహః సన్, ఖమ్ ఉత్పత ఉచ్చైర్భవ, ఇతి స్వప్రబన్ధ మాత్మానం వా ప్రతి కవేరుక్తి రితి. 'సంసర్గతో దోషగుణా భవన్తీ త్యేత న్మృషా యేన జలాశ్రయోఽపి, స్థిత్వాఽనుకూలం నిచులశ్చర న్తమాత్మానమారక్షతి సిన్ధువేగాత్.' ఇత్యేతచ్ఛ్లోకనిర్మాణా త్తస్యకవే ర్నిచులసంజ్ఞే త్యాహుః.

రత్నచ్ఛాయావ్యతికర ఇవ ప్రేక్ష్యమేతత్పురస్తా
ద్వల్మీకాగ్రాత్ప్రభవతి ధనుఃఖణ్డమాఖణ్డలస్య,
యేన శ్యామం వపురతితరాం కాన్తిమాపత్స్యతే తే
బర్హేణేవ స్ఫురితరుచినా గోపవేషస్య విష్ణోః. 15

టీ. రత్న చ్ఛాయా వ్యతికర ఇవ; రత్న = పద్మరాగాది మణుల యొక్క, ఛాయా = కాంతుల యొక్క, వ్యతికర ఇవ = కూడిక వలెను, ప్రేక్ష్యం = చూడఁ దగిన ఆఖండలస్య = ఇంద్రుని యొక్క, ఏతత్ ధనుః ఖండం- ఈధనుస్సు యొక్క తునుక, పురస్తాత్ = ఎదుట, వల్మీకాగ్రాత్ = పుట్ట కొన నుండి; ప్రభవతి=పుట్టుచున్నది, యేన=ఏ ధనుఃఖండము చేత, తే=నీయొక్క, శ్యామం = నల్లనైన, వపుః = శరీరము. స్ఫురితరుచినా ; స్ఫురిత = ప్రకాశించుచున్న, రుచినా = కాంతిగల, బర్హేణ = పింఛముచే గోపవేషస్య=గొల్లవారి వేషమును ధరించిన అనఁగా (నంద గృహమునం దుండు నట్టి), విష్ణోః=కృష్ణమూర్తి యొక్క, శ్యామం = నల్లని, వపురివ = దేహము వలె, అతితరాం = మిక్కిలి, కాంతిం = కాంతిని, ఆపత్స్యతే = పొంద గలదు.

తా. పద్మరాగాది రత్నములయొక్క నానావిధములయిన కాంతులు గలిసి యున్నటుల నెదుట నుండునట్టి యీపుట్టవివరము నుండి యింద్ర ధనుస్సు పుట్టుచున్నది. దానిచే నీదేహము పింఛముచేఁ బ్రకాశించునట్టి శ్రీకృష్ణమూర్తియొక్క శరీరము వలెఁ బ్రకాశింపఁ గలదు.

రత్నేతి— రత్నచ్ఛాయానాం పద్మరాగాది మణి ప్రభాణాం, వ్యతికరః మిశ్రణమివ, ప్రేక్ష్యం దర్శనీయమ్. ఆఖణ్డలస్య ఇన్ద్రస్య ఏతద్ధనుః ఖణ్డం, ఏతదితి హస్తేన నిర్దేశో వివక్షితః, పురస్తాత్ అగ్రే, వల్మీకాగ్రాత్, వామలూరువివరాత్ 'వామలూరుశ్చ నాకుశ్చ వల్మీకం పుంనపుంసకమ్' ఇత్యమరః. ప్రభవతి ఆవిర్భవతి, యేన ధనుఃఖణ్డేన, తే తవ, శ్యామం వపుః

స్ఫులితరుచినా ఉజ్జ్వలకాన్తినా. బర్హేణ పింఛేన, 'పింఛబర్హే నపుంసకే' ఇత్యమరః. గోపవేషస్య విష్ణోః గోపాలస్య కృష్ణస్య, శ్యామం వపు రివ, అతితరాం, కాన్తిం శోభాం, ఆపత్స్యతే ప్రాప్స్యతి.

త్వయ్యాయత్తం కృషిఫలమితి భ్రూవికారానభిజ్ఞైః
ప్రీతిస్నిగ్ధైర్జనపదవధూలోచనైః పీయమానః,
సద్యః సీరోత్కషణసురభి క్షేత్రమారుహ్య మాలం
కించిత్పశ్చాద్వ్రజ లఘుగతి ర్భూయ ఏవోత్తరేణ. 16

టీ. కృషి ఫలం; కృషి = సేద్యము యొక్క, ఫలం = పైరు వలనఁ గలిగిన ధాన్యాదులు, త్వయి = నీయందు, ఆయత్త మితి=అధీనమయిన దనే కారణమునుఁ బట్టి, ప్రీతి స్నిగ్ధైః, ప్రీతి = ప్రేమచేత స్నిగ్ధైః = చల్లనివైన, భ్రూ వికారా నభిజ్ఞైః, భ్రూ = కనుబొమల యొక్క, వికార = విలాసములను, అనభిజ్ఞైః = తెలియని, జనపద వధూ లోచనైః, జనపద = పల్లెలయందలి, వధూ=స్త్రీల యొక్క, లోచనైః = నేత్రములచేత, పీయమానః= మిక్కిలి యాసచేఁ జూడఁ బడుచున్న వాఁడవై. మాలం = మాలమనెడు (అనఁగాఁ గొండభూమి), క్షేత్రం=పొలమును, సద్యః = అప్పుడే, సీరోత్కషణ సురభి; సీర = నాఁగళ్లచేత నైన, ఉత్కషణ=దున్నుటచేత, సురభి = పరిమళము గలది యగునట్లు, ఆరుహ్య=అధిష్ఠించి (వర్షించి), కించిత్ = కొంచెము, పశ్చాత్ = వెనుకకు, వ్రజ=పొమ్ము, లఘుగతిః = శీఘ్రగమనము గలవాఁడ వై, భూయః=తిరిగి, ఉత్తరేణైవ = ఉత్తర మార్గముచేతనే, వ్రజ = వెళ్లుము.

తా. పైరులు పండుట నీవలననే యగును గనుక పల్లెలయందుండు స్త్రీలు నిన్నుఁ బ్రీతితోఁ జూచెదరు. భ్రూవిలాసము తెలియఁగని వారి చూపులును గనుఁగొనుటకు నీ కనువుపడును. దున్నియుండిన కొండభూముల నీవు వర్షించిన సువాసనగలు

గును. అంతఁ గొంతఁ బశ్చిమంబుగాఁ బోయి తిరిగి యథాపూర్వముగా నుత్తర మార్గముననే శీఘ్రముగా వెడలుము. (ఇక్కడ బహుభార్యలు గలవాఁడు ఏభార్యయం దైనను గూఢముగా విహరించి తన దాక్షిణ్యము చెడకుండ సందుగొందుల నుండి పోయి తిరిగి యందరిలో యథాపూర్వముగఁ బ్రవర్తించు ననుభావము ధ్వనించు చున్నది.)

త్వయీతి—కృషేః హలకర్షణః, ఫలం సస్యం. త్వయి * అధికరణవివక్షాయాం సప్తమీ, ఆయత్తమ్ అధీనం, 'అధీనో నిఘ్న ఆయత్తః' ఇత్యమరః, ఇతి హేతోః, ప్రీత్యా స్నిగ్ధైః, అకృత్రిమప్రేమార్ద్రైరిత్యర్థః. భ్రూవికారాణాం భ్రూవిలాసానాం, అనభిజ్ఞైః, పామరత్వాదితి శేషః, జనపదవధూనాం పల్లీయోషితాం, లోచనైః పీయమానః సాదరం వీక్ష్యమాణః సన్, మాలం మాలాఖ్యం క్షేత్రం శైలప్రాయమున్నతస్థలం, 'మాలమున్నతభూతలం' ఇత్యుత్పలమాలాయాం సద్యః తత్కాలమేవ, సీరైః హలైః, ఉత్కషణేన, కర్షణేన, సురభిఘ్రాణతర్పణం యథా తథా, ఆరుహ్య, తత్రాభివృష్యేత్యర్థః. 'సురభిర్ఘ్రాణతర్పణః' ఇత్యమరః. కించిత్పశ్చాత్, వ్రజ గచ్ఛ, లఘుగతిః తత్ర నిర్వృష్టత్వాత్ క్షిప్రగమనః సన్, 'లఘుక్షిప్రమరం ద్రుతం' ఇత్యమరః. భూయః పునరపి. ఉత్తరేణైవ ఉత్తరమార్గేణైవ, వ్రజ* 'తృతీయావిధానే ప్రకృత్యాదిభ్య ఉపసంఖ్యానం' ఇతి తృతీయా. యథా కశ్చిద్బహువల్లభః పతిః కుత్రచిత్క్షేత్రే గూఢం విహృత్య 'క్షేత్రం శరీరే కేదారే సిద్ధస్థాన కళత్రయోః' ఇతి విశ్వః. దాక్షిణ్యభఙ్గభయాన్నీచమార్గేణ నిర్గత్య పునః సర్వాధ్యక్ష ఇవ సంచరతి తద్వదితి ధ్వనిః.

త్వామాసార ప్రశమితవనోపప్లవం సాధు మూర్ధ్నా
వక్ష్యత్యధ్వశ్రమపరిగతం సానుమానామ్రకూటః,
న క్షుద్రోఽపి ప్రథమ సుకృతాపేక్షయా సంశ్రయాయ
ప్రాప్తే మిత్రే భవతి విముఖః కింపునర్యస్తథోచ్చైః. 17

టీ. ఆమ్రకూటః = ఆమ్రకూటమనెడు శిఖరములయందు మామిడి చెట్లు గల, సానుమాన్=పర్వతము, ఆసార ప్రశమిత వనోపప్లవం; ఆసార= ధారావర్షముచేత, ప్రశమిత=చల్లార్పఁబడిన, వనోపప్లవం=(అడవుల యుపద్రవము) దావాగ్ని గల, అధ్వశ్రమ పరిగతం; అధ్వశ్రమ = మార్గాయాసమును, పరిగతం=పొందిన, త్వాం నిన్ను, సాధు=లెస్సఁగా, మూర్ధ్నా=శిరస్సుచేత, వక్ష్యతి=వహింపఁగలదు, క్షుద్రోఽపి=నీచుఁడైనను, సంశ్రయాయ= ఆశ్రయించుటకొఱకు, మిత్రే=మిత్రుఁడు, ప్రాప్తే=వచ్చియుండఁగా, ప్రథమ సుకృతాపేక్షయా; ప్రథమ=ముందుచేసిన, సుకృతాపేక్షయా=ఉపకారము నాలోచించుటచేత, విముఖః = మారుమొగముఁ బెట్టినవాఁడుగా, న భవతి= కాఁడు, యః=ఎవ్వఁడు, తథా=ఆప్రకారము, ఉచ్చైః =గొప్పవాఁడో, సః= వాఁడు, (ఆమ్రకూటము) కింపునః=విముఖుఁడుగాఁడని యేమి చెప్పవచ్చును?

తా. నీవు చిత్రకూటపర్వతమునకు ధారావర్షముచేత దావాగ్నిని జల్లార్చి, యుపకారము చేసినవాఁడవు గాన మార్గాయాసముతో నీవు బోయినప్పుడు, ఆతఁడు నిన్ను లెస్సఁగాఁ బూజింపగలఁడు. లోకములో నల్పుఁడును తనకుపకారము చేసినమిత్రుఁడు వచ్చినప్పుడు పూజింప కుండఁడు. ఇఁక నంతటి వాఁడు పూజింప కుండునా.

త్వామితి, ఆమ్రాః చూతాః, కూటేషు శిఖరేషు, యస్య సః ఆమ్రకూటో నామ, సానుమాన్ పర్వతః 'ఆమ్ర శ్చూతో రసాలోఽసౌ' ఇతి 'కూటోఽస్త్రీ శిఖరం శృఙ్గం' ఇతి చామరః. ఆసారః ధారావృష్టిః, 'ధారాసంపాతఆరంభః. ఇత్యమరః. తేన, ప్రశమితో వనోపప్లవో(దావాగ్ని) ర్యేన తం, కృతోపకార మిత్యర్థః, అధ్వశ్రమేణ, పరిగతం వ్యాప్తం. త్వాం, సాధు సమ్యక్, మూర్ధ్నా వక్ష్యతి వోఢా* వహేర్లృట్; క్షుద్రః కృపణోఽపి, 'క్షుద్రో దరిద్రే కృపణే నృశంసే' ఇతి యాదవః, సంశ్రయాయ సంశ్రయణాయ, మిత్రే సుహృది 'అథ మిత్రం సఖా సుహృత్' ఇత్యమరః.

ప్రాప్తే అగతే, సతి, ప్రథమసుకృతాపేక్షయా పూర్వోపకారపర్యాలోచనయా, విముఖో న భవతి, యః తథా తేన ప్రకారేణ, ఉచ్చైః ఉన్నతః స ఆమ్రకూటః. కింపునః విముఖో న భవతీతి కిముత వక్తవ్యమిత్యర్థః. ఏతేన ప్రథమావసథే సౌఖ్యలాభాత్తే కార్యసిద్ధిరస్తీతి సూచితం; తదుక్తం నిమిత్తనిదానే. ప్రథమావసథే యస్య సౌఖ్యం తస్యాఖిలేఽధ్వని, శివం భవతి యాత్రాయామన్యథా త్వశుభం ధ్రువమ్' ఇతి.

ఛన్నోపాన్తః పరిణతఫలద్యోతిభిః కాననామ్రై
స్త్వయ్యారూఢే శిఖరమచలః స్నిగ్ధవేణీసవర్ణే,
నూనం యాస్యత్యమరమిథునప్రేక్షణీ యామవస్థాం
మధ్యే శ్యామః స్తన ఇవ భువః శేషవిస్తారపాణ్డుః.      18

టీ. పరిణత ఫల ద్యోతిభిః; పరిణత=పండిన, ఫ=పండ్లచేత. ద్యోతిభిః=ప్రకాశించునట్టి, కాన నామ్రైః = అడవిమామిడి చెట్లచేత, ఛన్నోపాన్తః; ఛన్న-కప్పఁబడిన, ఉపాన్తః=పార్శ్వములుగల, అచలః = (ఆమ్రకూట) పర్వతము, స్నిగ్ధవేణీ సవర్ణే; స్నిగ్ధ=నున్ననైన, వేణీ=జడతో, సవర్ణే=సమానమైన వర్ణముగల, త్వయి=నీవు, శిఖరం=శృంగమును. ఆరూఢే = ఎక్కినవాఁడవగుచుండఁగా, మధ్యే=నడుమ, శ్యామః=నల్లనై, శేషవిస్తారపాణ్డుః, శేష=ఇతరమైన విస్తార=విరివిగలచోటు నంతయు, పాణ్డుః=తెల్లనైన, భువః = భూమియొక్క, స్తనఇవ=స్తనమువలె అమర మిథున ప్రేక్షణీయాం; అమరమిథున=దేవద్వంద్వములచే, ప్రేక్షణీయాం=చూడఁదగిన, అవస్థాం=స్థితిని. యాస్యతి=పొందఁగలదు, నూనం=నిశ్చయము.

తా. ఆమ్రకూటమునం దడవి మామిళ్లు పండి చుట్టును గ్రమ్ముకొని యుండి తెల్లఁగాఁ గనుపట్టుచున్నవి. దాని శిఖరమునందు నల్లనివాఁడవైన నీవు వ్రాలినట్లైన చుట్టును తెల్లఁగను కొనయందు నల్లఁగ నుండునట్టి భూమియొక్క

స్తనమో యనున ట్లుండినదై దేవమిథునములకుఁ జూచుటకు వేడుకనుఁ గలిగించును.

ఛన్నేతి. హే మేఘ, పరిణతైః పరిపక్వైః ఫలైః - ద్యోతన్త ఇతి తథోక్తైః, ఆషాఢే వనచూతాః ఫలన్తి పచ్యన్తే చ మేఘవాతేనేత్యాశయః, కాననామ్రైః వనచూతైః ఛన్నోపాన్తః ఆవృతపార్శ్వః, అచలః ఆమ్రకూటాద్రిః, స్నిగ్ధ వేణీ సవర్ణే మసృణ కేశబన్ధసచ్ఛాయే, శ్యామవర్ణ ఇత్యర్థః, 'వేణీతు కేశబన్ధే జలస్రుతౌ' ఇతి యాదవః, త్వయి, శిఖరం శృఙ్గం, ఆరూఢే సతి*'యస్యచ భావేన భావలక్షణమ్' ఇతి సప్తమీ. మధ్యే శ్యామః, శేషే మధ్యాదన్యత్ర, విస్తారే పరితః, పాణ్డుః హారిణః 'హారిణః పాణ్డురః పాణ్డుః', ఇత్యమరః, భువః స్తనఇవ, అమరమిథునానాం ఖేచరాణామితి భావః, ప్రేక్షణీయాం దర్శనీయాం, అవస్థాం నూనం యాస్యతి, మిథునగ్రహణం కామినామేవ స్తనత్వే నోత్ప్రేక్షా సంభవతీతి కృతమ్. యథా పరిశ్రాన్తః కశ్చిత్కామీ కామిన్యాః కుచకలశే విశ్రాన్తః సన్స్వపితి తద్వద్భవానపి భువో నాయికాయాః స్తన ఇతి ధ్వనిః.

స్థిత్వా తస్మిన్వనచరవధూభుక్తకుఞ్జే ముహూర్తం
తోయోత్సర్గద్రుతతరగతిస్తత్పరం వర్త్మ తీర్ణః,
రేవాం ద్రక్ష్యస్యుపలవిషమే విన్ధ్యపాదే విశీర్ణాం
భక్తిచ్ఛేదైరివ విరచితాం భూతిమఙ్గే గజస్య. 19

టీ. వనచర వధూ భుక్త కుఞ్జే; వనచర = కిరాతులయొక్క, వధూ = స్త్రీలచే, భుక్త = అనుభవింపఁబడిన, కుఞ్జే = పొదరిండ్లుగల, తస్మిన్ = ఆయామ్రకూటమునందు, ముహూర్తం = అల్పకాలము, స్థిత్వా = నిలిచి, తోయోత్సర్గ ద్రుతతర గతిః; తోయ = ఉదకమును, ఉత్సర్గ = విడుచుటచేత, ద్రుతతర = మిక్కిలి శీఘ్రమయిన, గతిః = గమనము గలవాఁడవై, తత్పరం = ఆయామ్రకూటము తర్వాతనుండు, వర్త్మ = మార్గమును, తీర్ణః = అతిక్రమించిన వాఁడవై, ఉపలవిషమే; ఉపల = రాళ్లచే, విషమే = ఎచ్చుతగ్గయిన, విన్ధ్యపాదే; విన్ధ్య = విన్ధ్యపర్వతముయొక్క, పాదే = చేరువతిప్పయందు,

విశీర్ణాం = అంతటను వ్యాపించిన, రేవాం=నర్మదానది, గజస్య = ఏనుఁగు యొక్క, అఙ్గే = దేహమునందు, భక్తి చ్ఛేదైః; భక్తి = రేఖలయొక్క, ఛేదైః=విధములచేత, విరచితాం = చేయఁ బడిన, భూతి మివ = శృంగార మును వలె, ద్రక్ష్యసి=చూడఁ గలవు.

తా. ఆ యామ్రకూట పర్వతమునందు కిరాతాంగనలు పొదరిండ్లయందు విహరించు చుందురు. వారి విహారములు జూచుట యొక లాభము. అక్కడ వర్షించుటచేఁ దేలికపడి శీఘ్రముగాఁ బోవచ్చును. అట్లు కొంత దూరము మేగిన పిదప వింధ్య పాదమునందు నర్మదానది వ్యాపించి యున్నది. కావున నేనుఁగు దేహమునందు చేసిన శృంగారము వలె నుండును. అది చూచుట మఱియొక్క లాభము.

స్థిత్వేతి.—హే మేఘ, వనే చరన్తి తే వనచరాః*'తత్పురుషే కృతి బహుళమ్' ఇతి బహుళగ్రహణా దలుక్ న భవతి, తేషాం వధూభి ర్భుక్తాః, కుఞ్జాః లతాగృహాః యత్ర తస్మిన్, 'నికుఞ్జకుఞ్జౌ వాక్లీబే లతాది పిహితోదరే' ఇత్యమరః. తత్ర తే నయనవినోదోఽస్తీత్యర్థః, తస్మిన్ ఆమ్రకూటే, ముహూర్తమ్ అల్పకాలం, న తు చిరం. స్వకార్యవిరోధాదితి భావః, 'ముహూర్త మల్పకాలే స్యాద్ఘటికాద్వితయేఽపి చ' ఇతి శబ్దార్ణవే. స్థిత్వా విశ్రమ్య, తోయోత్సర్గేణ 'త్వామాసార—'ఇత్యుక్తవర్షణేన, ద్రుతతరగతిః లాఘవా ద్ధేతోః రతిశీఘ్రగమనః సన్, తస్మా దామ్రకూటాత్పర మనన్తరం తత్పరం, వర్త్మ మార్గం, తీర్ణః అతిక్రాన్తః, ఉపలైః పాషాణైః, విషమే, విన్ధ్యస్యాద్రేః, పాదే ప్రత్యన్తపర్వతే 'పాదాః ప్రత్యన్తపర్వతాః' ఇత్యమరః. విశీర్ణాం సమన్తతో విసృమరాం, ఏతేన కస్యాశ్చిత్కాముక్యాః ప్రియతమచరణపాతోఽపి ధ్వన్యతే, రేవాం నర్మదాం 'రేవా తు నర్మదా సోమోద్భవా మేఖలకన్యకా' ఇత్యమరః. గజస్య, అఙ్గే శరీరే, భక్తయో రచనాః, రేఖాఇతి యావత్ 'భక్తి ర్నిషేవణే భాగే రచనాయామ్' ఇతి శబ్దార్ణవే. తాసాం, ఛేదైః భఙ్గిభిః, విరచితాం, భూతిం, శృఙ్గారమివ భసితమివ వా

'భూతి ర్మాతఙ్గశృఙ్గారే జాతౌ భస్మని సంపది' ఇతి విశ్వః. ద్రక్ష్యసి; అయ మపి మహాంస్తే నయనకౌతుకలాభ ఇతి భావః.

తస్యా స్తిక్తై ర్వనగజమదై ర్వాసితం వాన్తవృష్టి
ర్జమ్బూకుఞ్జప్రతిహతరయం తోయమాదాయ గచ్ఛేః,
అన్తఃసారం ఘన తులయితుం నానిలః శక్ష్యతి త్వాం
రిక్తః సర్వో భవతి హి లఘుః పూర్ణతా గౌరవాయ. 20

టీ. ఘన = మేఘుఁడా! వాన్త వృష్టిః; వాన్త=కురియఁ బడిన, వృష్టిః = వానగలవాఁడ వై, (వమనము చేసికొనినవాఁడని ధ్వని) తిక్తైః = సుగంధము లైన (వగరైన యని యర్థాంతరము), వనగజమదైః; వనగజ= అడవి ఏనుఁగులయొక్క, మదైః=మదములచేత, వాసితం = పరిమళింపఁ జేయఁ బడిన (భావనచేయఁబడినయని యర్థాంతరము), జమ్బూకుఞ్జ ప్రతిహత రయం; జమ్బూకుఞ్జ = నేరేడు పొదలచేత, ప్రతిహత=అడ్డగింపఁ బడిన, రయం = వేగముగల (అనఁగా చక్కఁగా భావనచేయఁబడి చులకనైనదని భావము), తస్యాః=ఆ నర్మదానదియొక్క, తోయం = ఉదకమును, ఆదాయ = తీసికొని, గచ్ఛేః = పొమ్ము, అన్తః సారం = లోపల బలముగల, త్వాం = నిన్ను, అనిలః=ఆకాశవాయువు (శరీరమందలి వాయువని ధ్వని), తులయితుం = కదలించుటకు, న శక్ష్యతి=సమర్థ మైనది కాదు, రిక్తః = లోపల బలములేనట్టి, సర్వః=సకల జనము, లఘుః = తేలికగా, భవతి = అగుచున్నాఁడు, పూర్ణతా=నిండియుండుట, గౌరవాయ = గౌరవముకొఱకు (ఇతరులకుఁ గదలించుటకు సాధ్యము కాకుండుట కొఱకు).

తా. మేఘుఁడా! నీవు అక్కడ వర్షించి తరువాత సుగంధములై యడవి యేనుఁగుల మదముచేఁ బరిమళింపఁ జేయఁ బడిన యా నర్మదానదియొక్క జలమును తీసికొని పొమ్ము. ఆ యుదకమును గ్రహించుటవలన బరువుగానున్న నిన్ను వాయువు చెదరఁ గొట్టఁ జాలదు. రిక్తుఁడగు వాఁ డందఱికిని

జాలకనగా (అలక్ష్యముగా) నగును. లోపల సార ముండెనేని గౌరవము గలవాఁడగును. ఇక్కడ దొలుత వమనముఁజేసికొని తరువాత శ్లేష్మ హరించుటకు లఘుతిక్త కషాయమయిన యుదకముఁ ద్రాగుట వలన బలము గలిగి వాతము హరించునని ధ్వనించుచున్నది.

తస్యా ఇతి. హే మేఘ, వాన్తవృష్టిః ఉద్గీర్ణవర్షః సన్, కృతవమనశ్చ వ్యజ్యతే, తిక్తైః, సుగన్ధిభిః, తిక్తరసవద్భిశ్చ 'తిక్తో రసే సుగన్ధౌ చ,' ఇతి విశ్వః, వనగజమదైః, వాసితం సురభితం, భావితం చ 'హిమవ ద్విన్ధ్య మలయా గజానాం ప్రభవా నగాః' ఇతి విన్ధ్యస్య గజప్రభవత్వాదితిభావః. జమ్బూకుఞ్జైః ప్రతిహతరయం ప్రతిబద్ధవేగం, సుఖపేయమిత్యర్థః. అనేన లఘుత్వం కషాయభావనా చవ్యజ్యతే, తస్యాః రేవాయాః. తోయం,ఆదాయ, గచ్ఛేః వ్రజ, హేఘన మేఘ, అన్తః సారో బలం, యస్య తం, త్వాం, అనిలః ఆకాశవాయుః, శరీరస్థశ్చ గమ్యతే, తులయితుం, నశక్ష్యతి శక్తో న భవిష్యతి; తథాహి:—రిక్తః అన్తః సారశూన్యః, సర్వోఽపి, లఘుర్భవతి ప్రకమ్ప్యో భవతీత్యర్థః, పూర్ణతా సారవత్తా, గౌరవాయ, అప్రకమ్ప్యత్వాయ భవతీత్యర్థః. అయ మత్ర ధ్వనిః—ఆదౌ వమనశోధితస్యపుంసః పశ్చాచ్ఛ్లేష్మశోషణాయ లఘుతిక్తకషాయామ్బుపానా ల్లబ్ధబలస్య వాతప్రకోపో న స్యాదితి, యథాహ వాగ్భటః—'కషాయాశ్చ హిమా స్తస్య విశుద్ధేః శ్లేష్మణో హితాః, కిము తిక్తకషాయా వా యే నిసర్గా త్తృషాపహాః. కృతశుద్ధేః క్రమాత్పీత పేయాదేః పథ్యభోజినః, వాతాదిభిర్న బాధా స్యా దిన్ద్రి యైరివ యోగినః' ఇతి.

నీపం దృష్ట్వా హరితకపిశం కేసరై రర్ధరూఢై
రావిర్భూతప్రథమముకులాః కన్దలీశ్చానుకచ్ఛం,
జగ్ధ్వారణ్యేష్వధికసురభిం గన్ధమాఘ్రాయ చోర్వ్యాః
సారఙ్గాస్తే జలలవముచః సూచయిష్యన్తి మార్గమ్. 21

టీ. సారఙ్గాః = జింకలు (ఏనుఁగులు, తుమ్మెదలు); అర్ధరూఢైః = సగము మొలచిన, కేసరైః = కింజల్కములచే, హరిత కపిశం = ఆకుపచ్చ వర్ణమును నలుపుపచ్చవర్ణమును గల, నీపం = నేలకడిమి పువ్వును, దృష్ట్వా = చూచియు, తథా=అట్లు, అనుకచ్ఛం = పచ్చిక పట్టులయందు, ఆవిర్భూత ప్రథమముకుళాః. ఆవిర్భూతా=మొలచిన, ప్రథమముకుళాః=తొలి మొగ్గలు గల, కన్దలీః=నేలయరఁటిచెట్లను, జగ్ధ్వా=తినియును, అరణ్యేషు = అడవుల యందు. అధిక సురభిం=మిక్కిలి సువాసనగల, ఉర్వ్యాః=భూమియొక్క, గన్ధం = వాసనను, ఆఘ్రాయ చ = మూర్కొనియు, జల లవ ముచః = ఉదక బిందువులఁ గురియుచున్న, తే = నీయొక్క, మార్గం = త్రోవను, సూచయిష్యంతి = సూచింపఁ జేయఁ గలవు.

తా. నీ వక్కడ వర్షించు తొలుకరి వానచేత నేలకడిమి చెట్లు పూచును. నేలయనంట్లు మొలచును. ఆభూములు చినుకులచేఁ దడిసి పరిమళించును గనుక నీవు దాఁటి పోయిన తరువాతను గూడ నక్కడ జింకలు కడిమి పూలను కోరుచుండుటచేతను నేలయరంట్లను దినుచుండుటచేతను నాభూముల నాఘ్రాణించుటచేతను నక్కడివారికి నీవు వర్షించి పోయిన మార్గ మెఱుక పడఁ గలదు.

నీపమితి. సారఙ్గాః మతఙ్గజాః. కురఙ్గా వా 'సారఙ్గశ్చాతకే భృఙ్గే కురఙ్గే చ మతఙ్గజే' ఇతి విశ్వః. అర్ధరూఢైః ఏకదేశోద్గతైః, కేసరైః కిఞ్జల్కైః, హరితం పాలాశవర్ణం, కపిశం శ్యావవర్ణం, శ్యామారుణమితియావత్ 'పాలాశో హరితో హరిత్' ఇతి 'శ్యావః స్యాత్కపిశో ధూమ్రధూమలౌ కృష్ణలోహితే' ఇతి చామరః. హరితం చ తత్కపిశంచ*'వర్ణోవర్ణేన' ఇతి సమాసః. నీపం స్థలకదమ్బకుసుమం 'అథ స్థలకదమ్బకే నీపః స్యాత్పులకే' ఇతి శబ్దార్ణవే. దృష్ట్వా సంప్రేక్ష్య, విదిత్వేతి యావత్, తథా, కచ్ఛే ష్వనూపే ష్వనుకచ్ఛం * 'అవ్యయం విభక్తి' ఇత్యాదినా విభక్త్యర్థేఽవ్యయీభావః. 'జలప్రాయ మనూపం స్యా త్పుంసి కచ్ఛ స్తథావిధః'

ఇత్యమరః. ఆవిర్భూతప్రథమాః ప్రథమోత్పన్నా ముకుళా యాసాం తాః, కన్దళీః భూమికదళీః. 'ద్రోణపర్ణీ స్నిగ్ధకన్దా కన్దళీ భూకదళ్యపి' ఇతి శబ్దార్ణవే, జగ్ధ్వా భక్షయిత్వా * 'అదో జగ్ధిః' ఇతి జగ్ధ్యాదేశః. అరణ్యేషు, అధిక సురభిమ్ అతి ఘ్రాణతర్పణం, 'దగ్ధారణ్యేషు' ఇతి పాఠే 'దగ్ధమ్' ఇత్యధికవిశేషణ మర్థవత్త్వాత్, కన్దళీశ్చ దృష్ట్వేవేత్యన్వయో ద్రష్టవ్యః. నీపందష్ట్వేతిపాఠే దష్ట్వెత్యర్థః, ఉర్వ్యాః భూమేః, గన్ధ మాఘ్రాయ జలలవముచః మేఘస్య, తే ఏవ, మార్గం, సూచయిష్యన్తి అనుమాపయిష్యన్తి, యత్ర యత్ర వృష్టి కార్య నీపకుసుమాదికం దృశ్యతే తత్రతత్ర త్వయా వృష్ట మిత్యనుమీయత ఇతి భావః.

అమ్భోబిన్దుగ్రహణచతురాంశ్చాతకాన్ వీక్షమాణాః
శ్రేణీభూతాః పరిగణనయా నిర్దిశన్తో బలాకాః,
త్వామాసాద్య స్తనితసమయే మానయిష్యన్తి సిద్ధాః
సోత్కమ్పాని ప్రియసహచరీ సంభ్రమాలిఙ్గితాని. 22

టీ. అమ్భో బిన్దు గ్రహణ చతురాన్; అమ్భోబిన్దు = ఉదకబిందువులను, గ్రహణ = పట్టుకొనుటయందు, చతురాన్ = సమర్థములైన, చాతకాన్ = చాతకపక్షులను, వీక్షమాణాః = చూచుచున్నవారై, శ్రేణీ భూతాః=పంక్తులు తీరిన, బలాకాః = కొక్కెరపక్షులను, పరిగణనయా = లెక్కపెట్టుట చేతను. నిర్దిశన్తః = చేతులచేఁ జూపుచున్నవారైన, సిద్ధాః = సిద్ధపురుషులు, స్తనిత సమయే = నీవు ఉఱిమినప్పుడు, సోత్కంపాని = వేడుకతోఁ గూడికొనిన, ప్రియసహచరీ సమ్భ్రమాలిఙ్గితాని; ప్రియసహచరీ = ప్రియురాండ్రయొక్క, సమ్భ్రమ = విలాసముచేత నైన, ఆలిఙ్గితాని = ఆలింగనములను, ఆసాద్య = పొంది, త్వాం = నిన్ను, మానయిష్యన్తి = పూజింపఁగలరు.

తా. (ఈశ్లోకము ప్రక్షిప్తమని వ్యాఖ్యానమునఁ జెప్పఁబడి యున్నది) నీవు వర్షించునప్పుడు చాతకపక్షులు చినుకులు క్రిందఁ బడక మున్నే కొంక్కెతోఁ ద్రావును. కొక్కెరపక్షులు

చాలులు దీరి యాకసమున సంచరించు నప్పుడు సిద్ధులను దేవ యోని విశేషులు ఆ చాతకములను బలాకములనుఁ జూచు చున్నవారై నీవు ఉఱిమినప్పుడు భయముచేఁ దమంత వచ్చి కౌఁగిలించుకొనిన తమ ప్రియురాండ్ర కౌఁగిలింతలను బొంది నిన్ను మిక్కిలి పూజింపఁ గలరు. ఇందు స్త్రీలు వచ్చి పురుషు లను పురుషప్రార్థన లేకయే కౌఁగిలించుట పురుషుల కానందాతి శయము కావున నిన్ను విశేషించి పూజింతు రని భావము.

ప్రక్షిప్త మపి వ్యాఖ్యాయతే.—

అమ్భ ఇతి. అమ్భోబిన్దూనాం వర్షోదబిన్దూనాం, గ్రహణే 'సర్వం సహాపతిత మమ్బు న చాతకానామ్' ఇతి శాస్త్రాద్భూస్పృష్టోదకస్య తేషాం రోగహేతుత్వా దన్తరాల ఏవ స్వీకారే, చతురాం శ్చాతకాన్, వీక్ష మాణాః కౌతుకాత్పశ్యన్తః, శ్రేణీభూతాః బద్ధపఙ్క్తీః *'అభూతతద్భావే చ్వి:' బలాకాః బకపఙ్క్తీః, పరిగణనయా ఏకాద్వే తిస్ర ఇతి సంఖ్యానేన, నిర్దిశన్తః హస్తేన దర్శయన్తః. సిద్ధాః స్తనితసమయే త్వద్గర్జితకాలే సోత్కమ్పాని ఉత్కమ్పాపూర్వకాణి, ప్రియసహచరీణాం, సంభ్రమేణాలిఙ్గితా న్యాసాద్య, స్వయం గ్రహణాశ్లేషసుఖమనుభూయేత్యర్థః, త్వాం మానయిష్యన్తి, త్వన్నిమిత్తత్వా త్సుఖలాభస్యేతి భావః.

ఉత్పశ్యామి ద్రుతమపి సఖే మత్ప్రియార్థం యియాసోః
కాలక్షేపం కకుభసురభౌ పర్వతే పర్వతే తే,
శుక్లాపాఙ్గైః సజలనయనైః స్వాగతీకృత్య కేకాః
ప్రత్యుద్యాతః కథమపి భవాన్గన్తుమాశు వ్యవస్యేత్. · 23

టీ. సఖే = స్నేహితుఁడా! మత్ప్రియార్థం = నాప్రీతికొఱకు, ద్రుతం=శీఘ్రముగా, యియాసోః = పోవఁ గోరిన వాఁడవైనను, తే = నీకు, కకుభే సురభౌ; కకుభ = కొడిశ పూలచేత, సురభౌ = పరిమళించుచున్న, పర్వతేపర్వతే=ప్రతి పర్వతమునందు, కాలక్షేపం = కాలము గడచి పోవు

టను, ఉత్పశ్యామి=ఊహించుచున్నాను, సజల నయనైః; సజల = ఆనంద బాష్పములతోఁ గూడిన, నయనైః = నేత్రములు గల, శుక్లాపాఙ్గైః = (తెల్లనికనుగొనలుగల) నెమళ్లచేతను, కేకాః = (వాని) ధ్వనులను, స్వాగతీకృత్య-స్వాగత వచనమునుగా చేసి, ప్రత్యుద్యాతః ఎదుర్కొనఁ బడినవాఁడవై, భవాన్ = నీవు, కథమపి=ఎట్లైనను, ఆశు=శీఘ్రముగా, గంతుం = పోవుటకు, వ్యవస్యేత్ = ప్రయత్నింపుము.

తా. మిత్రుఁడా! నీవు నాకుఁ బ్రీతిఁజేయ వలయు నని శీఘ్రముగాఁ బోవఁ దలఁచినవాఁడవయ్యును మార్గములోఁ బ్రతిపర్వతమునందు కొడిశచెట్లు పూచియుండఁగా నెమళ్లు తమ కేకలచేతఁ గుశల ప్రశ్న చేసి యెదుర్కొని యతిథిపూజఁ జేయుచుండును. అప్పు డాలస్యముచేయక శీఘ్రముగాఁబోవఁ బ్రయత్నింప వలయును.

ఉత్పశ్యామీతి. హేసఖే మేఘ, మత్ప్రియార్థం యథాతథా, ద్రుతం క్షిప్రం, 'లఘు క్షిప్ర మరం ద్రుతం' ఇత్యమరః. యియాసోః యాతుమిచ్ఛోరపి * 'యాతేః సన్నన్తాదుప్రత్యయః' తే తవ, కకుభైః కుటజకుసుమైః, సురభౌ సుగన్ధిని, 'కకుభః కుటజేఽర్జునే' ఇతి శబ్దార్ణవే. పర్వతే 'పర్వతే ప్రతిపర్వతం *వీప్సాయాం ద్విరుక్తిః, కాలక్షేపం కాలవిలమ్బనం క్షేపో విలమ్బే నిన్దాయాం' ఇతి విశ్వః ఉత్పశ్యామి ఉత్ప్రేక్షే. విలమ్బహేతుం దర్శయ న్నాశుగమనం ప్రార్థయతే శుక్లేతి—సజలాని సానన్ద బాష్పాణి, నయనాని యేషాం తైః, శుక్లాపాఙ్గైః మయూరైః 'మయూరో బర్హిణో బర్హీ శుక్లాపాఙ్గః శిఖావలః' ఇతి యాదవః. కేకాః స్వవాణీః, 'కేకా వాణీ మయూరస్య' ఇత్యమరః. స్వాగతీకృత్య స్వాగతవచనీకృత్య, ప్రత్యుద్యాతః ప్రత్యుద్గతః, మయూరవాణీకృతాతిథ్య ఇత్యర్థః. భవాన్, కథమపి యథాకథంచిత్, ఆశు గన్తుం. వ్యవస్యేత్ ఉద్యుఞ్జీత ప్రార్థనే లిఙ్ *'శేషే ప్రథమః, ఇతి ప్రథమపురుషః, శేషశ్చాయం భవచ్ఛబ్దో యుష్మదస్మ చ్ఛబ్దవ్యతిరేకాత్. 'స్వాగతీకృత్య కేకాః' ఇత్యత్ర కేకా స్వా

రోప్యమాణస్య స్వాగతవచనస్య ప్రకృతి ప్రత్యుద్గమనోపయోగాత్పరిణామాలంకారః - తదుక్తమలంకారసర్వస్వే—'ఆరోప్యమాణస్య ప్రకృతోపయోగిత్వే పరిణామః' ఇతి.

పాణ్డుచ్ఛాయోపవనవృతయః కేతకైస్సూచిభిన్నై
ర్నీడారమ్భైర్గృహబలిభుజామాకులగ్రామచైత్యాః,
త్వయ్యాసన్నే పరిణతఫలశ్యామజమ్బూవనాన్తాః
సమ్పత్స్యన్తే కతిపయదినస్థాయిహంసా దశార్ణాః. 24

టీ. త్వయి = నీవు, ఆసన్నే = సమీపించిన వాఁడవు అగుచుండఁగా, దశార్ణాః = దశార్ణములను దేశములు, సూచిభిన్నైః; సూచి = మొగ్గలకొనలయందు, భిన్నైః = వికసించిన, కేతకైః మొగలి పూవుల చేత; పాణ్డుచ్ఛాయోపవన వృతయః; పాణ్డుచ్ఛాయా = తెల్లని కాంతిగల, ఉపవన = ఉద్యాన వనములయొక్క, వృతయః=చుట్టువెలుగులుగలవియు, గృహ బలిభుజాం=కాకులుమున్నగు గ్రామ్య పక్షులయొక్క, నీడారమ్భైః = గూండ్లు కట్టుట చేత, ఆకుల గ్రామ చైత్యాః, ఆకుల = తొట్రుపడు నట్టి, గ్రామ చైత్యాః = రచ్చ చెట్లు గలవియును, పరిణతఫలశ్యామ జమ్బూ వనాన్తాః; పరిణత=పండిన, ఫల=పండ్లచేత, శ్యామ=నల్లనైన, జమ్బూ = నేరేడు చెట్ల యొక్క, వన = తోఁపుల చేత, అన్తాః = అందము లైనవి గను, కతిపయ దిన స్థాయి హంసాః; కతిపయ దిన = కొన్ని దినములు, స్థాయి=ఉండునట్టి, హంసాః = హంసలు గలవిగను, సమ్పత్స్యన్తే = కాఁగలవు.

తా. నీవు దశార్ణ దేశములకు సమీపించు నప్పటికి ఆ దేశములయందు తోఁటలవెలుగులలో మొగలి పూవులు పూచి ఆ వెలుగులు తెల్లఁగా నుండును. గ్రామముల యందలి రచ్చ వృక్షములయందుఁ బక్షులు గూండ్లు కట్టుకొనును. ఆ చెట్లు కదలుచుండును, నేరేడుచెట్లు ఫలవంతములై నల్లఁగనుండును. హంసలు కొన్ని దినములే యక్కడ నుండునవి యగును.

పాణ్డ్వితి,— హే మేఘ, త్వయి, ఆసన్నే సంనికృష్టే, సతి, దశార్ణా నామ జనపదాః, సూచిభిన్నైః, సూచిషు ముకుళాగ్రేషు భిన్నైః వికసితైః 'కేతకీముకుళాగ్రేషు సూచిః స్యాత్' ఇతి శబ్దార్ణవే. కేతకైః కేతకీకుసుమైః, పాణ్డుచ్ఛాయాః హారిణవర్ణాః, ఉపవనానాం. వృతయః కణ్టకశాఖావరణాః యేషు తే తథోక్తాః 'ప్రాకారో వరణః సాలః ప్రాచీనం ప్రాన్తతో వృతిః', ఇత్యమరః, తథా, గృహబలిభుజాం కాకాదిగ్రామపక్షిణాం, నీడారమ్భైః కులాయనిర్మాణైః ''కులాయో నీడ మస్త్రియామ్' ఇత్యమరః. చిత్యాయాం ఇమాని చైత్యాని రథ్యావృక్షాః, 'చైత్య మాయతనే బుద్ధబిమ్బే చోద్దేశపాదపే' ఇతి రుద్రః. ఆకులాని సంకీర్ణాని, గ్రామేషు చైత్యాని యేషు తే తథోక్తాః, తథా పరిణతైః పక్వైః, ఫలైః శ్యామాని యాని జమ్బూవనాని, తైః, అన్తాః రమ్యాః, 'మృతా వవసితే రమ్యే సమాప్తావన్త ఇష్యతే' ఇతి శబ్దార్ణవే. తథా కతిపయే ష్వేవ దినేషు స్థాయినో హంసా యేషు తే తథోక్తా ఏవం విధాః, సంపత్స్యన్తే భవిష్యన్తి. 'పోటాయువతి స్తోక కతిపయ—' ఇత్యాదినా కతిపయ శబ్దస్యోత్తరపదత్వేఽపి దినశబ్దస్యోత్తరత్వ మస్య శాస్త్రస్య ప్రాయికత్వాత్.

తేషాం దిక్షు ప్రథితవిదిశాలక్షణాం రాజధానీం
గత్వా సద్యః ఫలమవికలం కాముకత్వస్య లబ్ధా,
తీరోపాన్తస్తనితసుభగం పాస్యసి స్వాదు యత్త
త్సభ్రూభఙ్గం ముఖమివ పయో వేత్రవత్యాశ్చలోర్మి. 25

టీ దిక్షు = దిక్కులయందు, ప్రథిత విదిశా లక్షణాం; ప్రథిత = ప్రసిద్ధమైన, విదిశా లక్షణాం = విదిశ యనెడు పేరుగల, తేషాం=ఆదశార్ణదేశముల యొక్క, రాజధానీం = ముఖ్యపట్టణమును, గత్వా = పొంది, సద్యః = అప్పుడే, కాముకత్వస్య = విలాసిగా నుండుట యొక్క, అవికలం= సమగ్రమైన, ఫలం = ప్రయోజనమును, లబ్ధా=పొందఁబడఁగలదు, యత్ = ఏకారణమువలన, స్వాదు=మధురమై, చలోర్మి; చల=కదలుచున్న, ఊర్మి =

తరంగములు గల, వేత్రవత్యాః= వేత్రవతీ నదియొక్క, పయః = ఉదకమును, సభ్రూభంగం=బొమముడితోఁ గూడుకొనిన, ముఖమివ = అధరమును వలె, తీరోపాన్త స్తనిత సుభగం; తీరోపా'న్త=ఒడ్డు దాపునందు, స్తనిత = ఉఱుము చేత, సుభగం = సుందరముగా, పాస్యసి = పానముచేయఁ గలవో.

తా. ఆ దశార్ణ దేశములకు రాజధాని యగు విదిశాపట్ట ణము సకల దిక్కులయందును ప్రసిద్ధ మైనది. అక్కడికి నీవు పోయినప్పుడు కామునికిఁ గలుగు ఫల మంతయు నీకుఁ గలు గును. ఎట్టనఁగా ఆ పట్టణ సమీపమునందు వేత్రవతి యను నది గలదు. మధురమై కదలుచుండెడు తరంగములు గల యుదక మును బొమముడిపాటుతోఁ గూడికొనిన ప్రియురాలి యధర మునువలె రతికూజితముఁ జేయునటుల తిన్నగా నుఱుముచుఁ బానముఁ జేయఁగలవు.

తేషామితి. దిక్షు, ప్రథితం ప్రసిద్ధం విదిశేతి, లక్షణం నామధేయం, యస్యాస్తాం 'లక్షణం నామ్ని చిహ్నే చ' ఇతి విశ్వః. తేషాం దశార్ణానాం, సంబన్ధినీం, ధీయన్తేఽస్యామితి ధానీ *'కరణాధికరణయోశ్చ' ఇతి ల్యుట్. రాజ్ఞాం ధానీ, రాజధానీ * 'కృద్యోగా చ షష్ఠీ సమస్యతే' ఇతి వక్తవ్యాత్సమాసః, తాం ప్రధాననగరీం, 'ప్రధాననగరీ రాజ్ఞాం రాజధా నీతి కథ్యతే' ఇతి శబ్దార్ణవే. గత్వా ప్రాప్య, సద్యః కాముకత్వస్య విలాసి తాయాః, 'విలాసీ కాముకః కామీ స్త్రీపరో రతిలమ్పటః, ఇతి శబ్దార్ణవే. అవికలం సమగ్రం, ఫలం ప్రయోజనం, లబ్ధా లప్స్యతే, త్వయేతి శేషః * కర్మణి లుట్, కుతః, యత్ యస్మాత్కారణాత్, తత్, స్వాదు మధురం, చలా ఊర్మయో యస్య తత్, చలోర్మి తరఙ్గితం వేత్రవత్యా నామ నద్యాః పయః, సభ్రూభఙ్గం భ్రుకుటియుక్తం దశనపీడయేతి భావః, ముఖమివ అధర మిత్యర్థః. తీరోపాన్తే, తటప్రాన్తే, యత్ స్తనితం గర్జితం, తేన సు భగం యథాతథా, స్తనితశబ్దేన మణిత మపి ధ్వన్యతే * 'ఊర్ధ్వముచ్ఛ్వసితశ్వా సాసికం హుఙ్కృతం మణిత మభ్రఘోషవత్' ఇతి లక్షణమ్' పాస్యసి *

పిబతేర్థ క్రట్ *'కామినా మధరాస్వాదః సురతా దతిరిచ్యతే' ఇతి వాత్స్యాయనీయ మాదిలి భావః.

నీచై రాఖ్యం గిరిమధివసే స్తత్ర విశ్రామ హేతో
స్త్వత్సమ్పర్కా త్పులకితమివ ప్రౌఢపుష్పైః కదమ్బైః,
యః పణ్యస్త్రీరతిపరిమళో ద్గారిభిర్నాగరాణా
ముద్దామాని ప్రథయతి శిలావేశ్మభిర్యౌవనాని. 26

టీ. తత్ర = ఆ విదిశాపట్టణ సమీపమునందు, విశ్రామ హేతోః = శ్రమదీర్చు కొనుటకు, ప్రౌఢ పుష్పైః = చక్కఁగా వికసించిన పూవులుగల, కదమ్బైః = కడిమి చెట్లచేతను, త్వ త్సమ్పర్కాత్ = నీవుకూడుట వలన, పులకితమివ = గగుర్పాటు గలిగి నట్లున్న, నీచై రాఖ్యం గిరిం = నీచై యను పేరుగల గిరియందు, అధివసేః = నివసింపుము, యః = ఏనీచైర్గిరి, పణ్యస్త్రీరతి పరిమళోద్గారిభిః; పణ్యస్త్రీ = వేశ్యలయొక్క, రతి = సురతములయందలి, పరిమళ = పరిళమును, ఉద్గారిభిః = వెడలఁ గ్రక్కుచున్న, శిలా వేశ్మభిః = గుహాలచేత, నాగరాణాం = పురజనులయొక్క, ఉద్దామాని = అధికములయిన, యౌవనాని = యౌవనములను, ప్రథయతి = ప్రకటింపఁ జేయుచున్నదో.

తా. ఆ విదిశాపట్టణ సమీపమున నీవు విశ్రమించుటకుఁ దగిన చోటు గలదు. ఏది యనిన, సఖుఁడవైన నీవు కూడుటఁ జేసి పూచిన కడిమిచెట్ల చేతనైన ప్రేమాతిశయముచే గగుర్పాటుగలది యగు నీచైర్గిరి గలదు. అందు నివసింపుము. అక్కడ మిగుల మక్కువగల వేశ్యలతోఁ గూడికొనిన నాగర పురుషులయొక్క యౌవనాతిశయములఁ దెలియఁ గలవు.

నీచై రితి. హే మేఘ, తత్ర విదిశాసమీపే, విశ్రామో విశ్రమః ఖేదాపనయః *భావార్థే ఘఞ్ ప్రత్యయః. స ఏవ హేతుః, తస్య విశ్రామ హేతోః విశ్రామకారణాత్, విశ్రామార్థ మిత్యర్థః. * 'షష్ఠీ హేతుప్రయోగే' ఇతిషష్ఠీ*

విశ్రామేత్యత్ర *'నోదాత్తోపదేశస్య మాన్తస్యానాచమేః' ఇతి పాణినీయే వృద్ధిప్రతిషేధేఽపి *'వా శ్రమోవా' ఇతిచాన్ద్రవ్యాకరణే వికల్పేన వృద్ధి విధానాద్రూపసిద్ధిః, ప్రౌఢపుష్పైః ప్రబుద్ధకుసుమైః, కదమ్బైః నీపవృక్షైః, త్వత్సమ్పర్కాత్ తవసఙ్గాత్, పులకా అస్య జాతాః పులకితః *తారకాదిత్వా దితచ్ప్రత్యయః పులకితమివ సఞ్జాతపులకమివ స్థితం, నీచైరిత్యాఖ్యా యస్య తం నీచైరాఖ్యం, గిరి మధివసేః, గిరౌ వసే రిత్యర్థః ఉపాన్వధ్యాఙ్వసః, ఇతి కర్మత్వం, యో నీచైర్గిరిః, పణ్యాః, క్రయ్యాః, స్త్రియః పణ్యస్త్రియః వేశ్యాః, 'వారస్త్రీ గణికా వేశ్యా పణ్యస్త్రీ రూపజీవినీ' ఇతి శబ్దార్ణవే. తాసాం రతిషు యః పరిమళో గన్ధవిశేషః, విమర్దోత్థే పరిమళో గన్ధేజనమనోహరే' ఇత్యమరః, తమ్, ఉద్గిరన్తి; ఆవిష్కుర్వన్తి ఇతి తథోక్తాని, తైః, శిలావేశ్మభిః కన్దరై నాగరాణాం, పౌరాణామ్, ఉద్దామాని ఉత్కటాని, యౌవనాని ప్రథయతి ప్రకటయతి, ఉత్కటయౌవనాః క్వచిదనురక్తా వారాఙ్గనా విస్రమ్భవిహార కాఙ్క్షిణ్యో మాత్రాదిభయా న్నిశీథసమయే కంచన వివిక్తం దేశమాశ్రిత్య రమన్తే తచ్చాత్ర బహుళమస్తీతి ప్రసిద్ధిః. అత్రోద్గారశబ్దో గౌణార్థత్వాన్న జుగుప్సావహః ప్రత్యుత కావ్యస్యాతిశోభాకరఏవ, తదుక్తం దణ్డినా, 'నిష్ఠ్యూతో ద్గీర్ణవాన్తాది గౌణవృత్తి వ్యపాశ్రయమ్, అతిసున్దర మన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే' ఇతి.

విశ్రాన్తః సన్వ్రజ వననదీతీరజాతాని సిఞ్చ
న్నుద్యానానాం నవజలకణై ర్యూథికాజాలకాని,
గణ్డస్వేదాపనయనరుజాక్లాన్తకర్ణోత్పలానాం
ఛాయాదానాత్క్షణపరిచితః పుష్పలావీముఖానామ్. 27

టీ. (తత్ర=ఆనీచైర్గిరియందు) విశ్రాంత స్సన్ = శ్రమఁ దీర్చుకొనిన వాఁడవగుచు, వన నదీతీర జాతాని; వన = అడవులయందలి, నదీ = ఏఁటియొక్క, తీర = ఒడ్డులయందు, జాతాని = పుట్టిన (మొలచిన), ఉద్యానానాం =విహార వనముల సంబంధము లయిన, యూథికా జాలకాని = మొల్ల మొగ్గ

లను, నవ జల కణైః = క్రొత్తనీటిచుక్కలచేత, సిఞ్చన్ = తడుపుచున్న వాఁడవై, గణ్డ స్వేదా పనయన రుజా క్లాన్త కర్ణోత్పలానాం; గణ్డ=చెక్కిళ్ల యందలి, స్వేద=చెమటను, అపనయన=పోఁగొట్టుటచేతనైన, రుజా=బాధచేత, క్లాన్త = వాడిన, కర్ణోత్పలానాం = చెవికొనల నుంచుకొనిన నల్లకలువలుగల, పుష్పలావీ ముఖానాం; పుష్పలావీ = పువ్వులుగోయు స్త్రీలయొక్క, ముఖానాం = ముఖములకు, ఛాయా దానాత్ = నీడనిచ్చుటవలన (కాంతి నిచ్చుటవలన), క్షణ పరిచితః=కొంచెముసేపు పరిచయముగలవాఁడవై, వ్రజ= పొమ్ము.

తా. మేఘుఁడా! నీవు ఆ నీచైర్గిరియందు శ్రమదీర్చు కొనుచు అక్కడ నుండు విహారములయందు ఏరుల యొడ్డుల యందు మొలచిన మొల్ల మొగ్గలనుఁ దడుపుచు పూవులుగోయు చున్న స్త్రీలకు ఎండచేత చెమట పట్టకుండునట్లు నీడను గలుగఁ జేయుము ఆ యుపకారముచేత వారికిని నీకును పరి చయము కలుగును. అట్టి కాముకీ సంబంధము నీకు మిక్కిలి సంతోషకర మగు నని భావము.

విశ్రాన్తఇతి. విశ్రాన్తః సన్ తత్ర నీచైర్గిరౌ వినీతాధ్వశ్రమః సన్, వనే, అరణ్యే, యా నద్యస్తాసాం తీరేషు జాతాని స్వయంరూఢాని అకృత్రి మాణీత్యర్థః. 'నదనదీ—'ఇతి పాఠే. * 'పుమాన్ స్త్రియా' ఇత్యేకశేషో దుర్వారః, ఉద్యానానాం ఆరామాణాం సంబన్ధీని, యూథికాజాలకాని మాగధీకుసుమముకుళాని, 'అథ మాగధీ గణికా యూథికా' ఇత్యమరః. 'కోరక జాలక కలికా కుడ్మల ముకుళాని తుల్యాని' ఇతి హలాయుధః. నవజల కణైః, సిఞ్చన్ ఆర్ద్రీకుర్వన్, అత్ర సిఞ్చతేరార్ద్రీకరణార్థత్వాద్ద్రవద్రవ్యస్య కరణత్వం, యత్ర తు క్షరణమర్థస్తత్ర ద్రవద్రవ్యస్య కర్మత్వం యథా— 'రేతః సిక్త్వా కుమారీషు' 'సుఖై ర్నిషిఞ్చన్తమివామృతం త్వచి' ఇత్యేవమాది, ఏవం కిరతీత్యాదీనామపి 'రజః కిరతి మారుతః' 'అవాకిరన్ వయోవృద్ధాస్తం లాజైః పౌరయోషితః' ఇత్యాది ష్వర్థభేదాశ్రయణేన రజోలాజాదీనాం

కర్మత్వకరణత్వే వేదితవ్యే, తథా, గణ్డయోః కపోలయోః స్వేదస్య, అపనయనేన, ప్రమార్జనేన యా, రుజా పీడా * భిదాదిత్వాదఙ్ ప్రత్యయః. తయా క్లాన్తాని మ్లానాని; కర్ణోత్పలాని యేషాం తేషాం తథోక్తానాం, పుష్పాణి లునన్తీతి పుష్పలావ్యః పుష్పాపచాయికాః స్త్రియః * 'కర్మణ్యణ్' * 'టిడ్ఢాణఞ్—' ఇత్యాదినా ఙీప్, తాసాం ముఖాని తేషాం, ఛాయాయాః అనాతపస్య దానాత్, కాన్తిదానం చ ధ్వన్యతే, 'ఛాయా సూర్యప్రియా కాన్తిః ప్రతిబిమ్బమనాతపః' ఇత్యమరః కాముకదర్శనాత్ కాముకీనాం ముఖవికాసో భవతీతి భావః, క్షణపరిచితః క్షణం సంస్పృష్టః సన్, న తు చిరం కార్యవిలమ్బనాత్, వ్రజ గచ్ఛ.

వక్రః పన్థా యదపి భవతః ప్రస్థితస్యోత్తరాశాం
సౌధోత్సఙ్గప్రణయవిముఖో మాస్మ భూరుజ్జయిన్యాః,
విద్యుద్దామస్ఫురితచకితైర్యత్ర పౌరాఙ్గనానాం
లోలాపాఙ్గైర్యది న రమసే లోచనైర్వఞ్చితః స్యాః. 28

టీ. ఉత్తరాశాం=ఉత్తరపుదిక్కుఁగూర్చి, ప్రస్థితస్య = ప్రయాణము చేయుచున్న, భవతః=నీకు, ఉజ్జయిన్యాః=ఉజ్జయినీపట్టణముయొక్క, పన్థా మార్గము, వక్రో యదపి = వంకరైనదైనను, ఉజ్జయిన్యాః = ఉజ్జయినీపట్టణముయొక్క, సౌధోత్సఙ్గ ప్రణయ విముఖః; సౌధ = మేడలయొక్క, ఉత్సఙ్గ= ఉపరిభాగములయందు; ప్రణయ=పరిచయమునకు, విముఖః = పరాఙ్ముఖుఁడవు (ఇష్టములేనివాఁడవు), మాస్మభూః=కావలదు, యత్ర = ఏయుజ్జయినియందు, విద్యుద్దామ స్ఫురిత చకితైః; విద్యుద్దామ = మెఱపుఁదీఁగలయొక్క, స్ఫురిత= మెఱయుటవలన, చకితైః=భయపడిన, లోలాపాఙ్గైః లోల=చలించుచున్న, అపాఙ్గైః=కటాక్షములుగల, పౌరాఙ్గనానాం=పురస్త్రీలయొక్క, లోచనైః= నేత్రములచేత; న రమసే యది = క్రీడింపక యుంటివేని వఞ్చితః = మోసపుచ్చఁబడినవాఁడవు, స్యాః=అగుదువు.

తా. ఓ మేఘుఁడా ! ఉత్తరపు దిక్కునకుఁ బోవుచున్న నీకు ఉజ్జయినీమార్గము వంకరైనను ఉజ్జయినికిఁ బోవలసినది. ఎందు కనఁగా ? అక్కడి స్త్రీలు నీ మెఱుపులను జూచి భయపడుదురు. అప్పుడు వారిబెదరుచూపు బహు సుందరముగ నుండును. ఆసౌందర్యమును జూడనియెడల నీజన్మము నిష్ప్రయోజనము.

వక్ర ఇతి. ఉత్తరాశాం ఉదీచీం దిశం ప్రతి, ప్రస్థితస్య భవతః, పన్థాః ఉజ్జయినీమార్గః, వక్రో యదపి దూరో యద్యపీత్యర్థః, విన్ధ్యాదుత్తరవాహిన్యా నిర్విన్ధ్యాయాః ప్రాగ్భాగే కియత్యపి దూరే స్థితోజ్జయినీ, ఉత్తరాపథస్తు నిర్విన్ధ్యాయాః పశ్చిమ ఇతి వక్రత్వం తథాపి, ఉజ్జయిన్యాః విశాలానగరస్య, 'విశాలోజ్జయినీ సమే' ఇత్యుత్పలః. సౌధానాం, ఉత్సఙ్గేషు ఉపరిభాగేషు ప్రణయః పరిచయః. 'ప్రణయః స్యాత్పరిచయే యాచ్ఞాయాం సౌహృదేఽపిచ' ఇతియాదవః తస్య, విముఖః పరాఙ్ముఖో మాస్మభూః నభవేరిత్యర్థః *'స్మోత్తరే లఙ్ చ' ఇతి చకారాదాశీరర్థే లుఙ్. * 'నమాఙ్యోగే' ఇత్యడాగమప్రతిషేధః. యత్ర ఉజ్జయిన్యాం, విద్యుద్దామ్నాంవిద్యుల్లతానాం, స్ఫురితేభ్యః స్ఫురణేభ్యః చకితైః భీతైః, లోలాపాఙ్గైః చఞ్చలకటాక్షైః పౌరాఙ్గనానాం, లోచనైః నయనైః న రమసే యది, వఞ్చితః ప్రతారితః స్యాః జన్మవైఫల్యం భవే దిత్యర్థః.

వీచిక్షోభస్తనితవిహగశ్రేణికాఞ్చీగుణాయాః
సంసర్పన్త్యాః స్ఖలితసుభగం దర్శితావర్తనాభేః,
నిర్విన్ధ్యాయాః పథి భవ రసాభ్యన్తరః సన్నిపత్య
స్త్రీణామాద్యం ప్రణయవచనం విభ్రమోహి ప్రియేషు. 29

టీక. మిత్రుఁడా! పథి = మార్గమునందు, వీచిక్షోభస్తనితవిహగశ్రేణికాఞ్చీగుణాయాః; వీచి=అలలయొక్క, క్షోభ=కదలుటచేత, స్తనిత = ధ్వని చేయుచున్న, విహగ = [హంసాది]పక్షులయొక్క, శ్రేణి = పంక్తియనెడు

కాఞ్చీగుణాయాః=మొలనూలుగలదియు, స్ఖలితసుభగం; స్ఖలిత=తొట్రుపాటు చేత, సుభగం=సుందరముగా, సంసర్పన్త్యాః=ప్రవహించు [పోవు] చున్నదియు,

రసేన 'శృఙ్గారేణ అభ్యన్తరః అన్తరఙ్గః భవ, సర్వథా తస్యా రస మనుభవేత్యర్థః, శృఙ్గారాదౌ జలే వీర్యే సువర్ణే విషశుక్రయోః, తిక్తాదా వమృతే చైవ నిర్యాసే పారదే ధ్వనౌ, ఆస్వాదే చ రసం ప్రాహుః' ఇతి శబ్దార్ణవే. నను తత్ప్రార్థనామన్తరేణ కథం తత్రానుభవో యుజ్యత ఇత్యత ఆహ స్త్రీణామితి.- స్త్రీణాం ప్రియేషు విషయే, విభ్రమః విలాస ఏవ. ఆద్యం ప్రణయవచనం ప్రార్థనావాక్యం, హి, స్త్రీణా మేష స్వభావో యద్విలాసైరేవ రాగప్రకాశనం న తు కణ్ఠత ఇతి భావః, విభ్రమశ్చాత్ర నాభిసందర్శనాది రుక్త ఏవ.

వేణీభూతప్రతనుసలిలా సా త్వతీతస్య సిన్ధుః
పాణ్డుచ్ఛాయా తటరుహతరుభ్రంశిభిర్జీర్ణపర్ణైః,
సౌభాగ్యం తే సుభగ విరహావస్థయా వ్యఞ్జయన్తీ
కార్శ్యం యేన త్యజతి విధినా స త్వయైవోపపాద్యః. 30

టీ. వేణీభూత ప్రతను సలిలా, వేణీభూత = జడగా నుండు నట్టి, ప్రతను = సూక్ష్మమగు, సలిలా = ఉదకముగలదియు, అనఁగా జడగా నల్లఁబడిన వెండ్రుకలు కలదని భావము. తటరుహ తరు భ్రంశిభి; తట = ఒడ్డుల యందు, రుహ = మొలచిన, తరు = చెట్లనుండి, భ్రంశిభిః = జారిపడిన, జీర్ణ పర్ణైః = ఎండు టాకులచేత, పాణ్డుచ్ఛాయా = తెల్లని కాంతిగలదియు, సుభగ = సుందరుఁడా ! విరహావస్థయా = ఎడఁబాసి యుండుటచేత, అతీతస్య = (ఇంతకాలము) గడిఁచి వచ్చిన, తే = నీయొక్క, సౌభాగ్యం = సౌందర్యమును, వ్యఞ్జయన్తీ = ప్రకాశించుచున్నదైన, సాసిన్ధుః = ఆనిర్వింధ్యానది యేన విధినా = ఏవ్యాపారముచేత కార్శ్యం = విరహముచేత నైన చిక్కిపోవుటను, త్యజతి = విడిచి పెటుచున్నదో, సః = ఆవ్యాపారము, త్వయైవ=నీచేతనే, ఉపపాద్యః=సంపాదింపఁ దగినది.

తా: మేఘుఁడా ! మిక్కిలి సుందరుండ వగు నిన్ను ఎడఁబాయుటచేత ఆ నిర్వింధ్యానది సన్నని జాలుగాఁ బారు

చున్న జలమనే జడ వేసికొని ఒడ్డులయందు మొలచి యున్న చెట్లనుండి రాలిన యెండిపోయిన యాకులచేతఁ దెల్లఁ బారినదై యిట్టివిరహావస్థచేతఁ జూచువారికి (ఈనిర్వింధ్య ప్రియుఁడెంతో సుందరుఁడు గావుననే యతని నెడఁబాసి యీనది యింత చిక్కినది యనుకొనినట్లు) నీ చక్కఁదనముఁ బ్రచురించుచున్న యా నిర్వింధ్యకు సంతోషము కలుగు నటు ప్రవర్తించుము.

నిర్విన్ధ్యాయా విరహావస్థాం వర్ణయం స్తన్నిరాకరణం ప్రార్థ్యతే.—

వేణీతి. అవేణీ వేణీభూతం వేణ్యాకారం, ప్రతను స్తోకంచ. సలిలం యస్యాః సా తథోక్తా, అన్యత్ర వేణీభూత కేశపాశేతి చ ధ్వన్యతే, రోమ స్త్రీతి ధ్రుమాః. ఇగుపధ లక్షణః క ప్రత్యయః, తటయో రుహో యే తరవ స్తేభ్యో భ్రేశ్య స్తీతి తథోక్తైః. జీర్ణపర్ణైః శుష్కపత్రైః, పాణ్డుచ్ఛాయా పాండువర్ణా, అతఏవ, హేసుభగ, విరహావస్థయా, పూర్వోక్తప్రకారయా కరణేన అతీతస్య ఏతావన్తం కాల మతీత్య గతస్య, ప్రోషితస్యేత్యర్థః తే తవ, సౌభాగ్యం సుభగత్వం * 'హృ ద్భగ సిన్ధ్వన్తే పూర్వపదస్యచే' త్యుభయపదవృద్ధిః. వ్యఞ్జయన్తీ ప్రకాశయన్తీ, సఖలు సుభగో యమఙ్గనాః కామయన్తి ఇతి భావః, సా పూర్వోక్తా, సిన్ధుః నదీ నిర్విన్ధ్యాఖ్యా, 'స్త్రీ నద్యాం వా నదే సిన్ధు ర్దేశభేదే ఉమ్బుధౌ గజ' ఇతి వైజయన్తీ. యేన, విధినా వ్యాపారేణ, కార్శ్యం త్యజతి స విధిః త్వయైవ, ఉపపాద్యః కర్తవ్యఇత్యర్థః. సచ విధి రేకత్ర వృష్టి రన్యత్ర సంభోగః తదభావనిబన్ధనత్వా త్కార్శ్యస్యేతి భావః. ఇయం పఞ్చమీ మదనావస్థా, ఉక్తం చ రతిరహస్యే — 'నయనప్రీతిః ప్రథమా చిత్తాసఙ్గస్తతోఽథ సంకల్పః, నిద్రోచ్ఛేద స్తనుతా విషయనివృత్తి స్త్రపానాశః, ఉన్మాదో మూర్ఛా మృతిరిత్యేవం స్మరదశా దశైవ స్యుః' ఇతి. 'తామతీతస్యే' తిపాఠ మాశ్రిత్య సిన్ధుర్నామ నద్యన్తరమితి వ్యాఖ్యానం తు, సిన్ధుర్నామ కశ్చిన్నదః కాశ్మీరదేశేఽస్తి నదీతు కుత్రాపి నాస్తి ఇత్యుపేక్ష్యమిత్యాచక్షతే.

ప్రాప్యావన్తీనుదయనకథాకోవిదగ్రామవృద్ధాన్
పూర్వోద్దిష్టా మనుసర పురీం శ్రీవిశాలాం విశాలాం,
స్వల్పీభూతే సుచరితఫలే స్వర్గిణాం గాం గతానాం
శేషైః పుణ్యైర్హృతమివ దివః కాన్తిమత్ఖణ్డమేకమ్. 31

టీ. ఉదయన కథా కోవిద గ్రామ వృద్ధాన్; ఉదయన = వత్సరాజు యొక్క, కథా = కథలను, కోవిద = బాగుగాఁ దెలిసిన, గ్రామ వృద్ధాన్ = గ్రామముల యందలి పెద్దవారు గల, అవన్తీన్=అవంతి దేశములను, ప్రాప్య = పొంది, పూర్వోద్దిష్టాం = పూర్వమందుఁ జెప్పబడినదైన, శ్రీవిశాలాం; శ్రీ = సంపదచే, విశాలాం = గొప్పదైనదియు, సుచరితఫలే = (స్వర్గభోగ రూప మైన) పుణ్య ఫలము, స్వల్పీభూతే = కొంచ మైనది కాఁగా, గాం=భూమిని, గతానాం = పొందిన, స్వర్గిణాం = స్వర్గలోకము నందలి సుఖము నను భవించు వారియొక్క, శేషైః = అనుభవింపఁగా మిగిలినట్టి, పుణ్యైః = పుణ్య ములచేత, హృతం = తేఁబడిన, కాన్తిమత్ = మిక్కిలి వెలుఁగుచున్నట్టి, ఏకం = ముఖ్యమగు, దివః = స్వర్గము యొక్క, ఖణ్డమివ = భాగమో యను నట్లున్న, విశాలాం=ఉజ్జయినీ పట్టణమును, అనుసర=పొందుము.

తా. అవంతి దేశము ప్రసిద్ధమైనది. ఆ దేశమందలి గ్రామములయందుండు పెద్దవారుదయన మహారాజు వాసవ దత్త యను కన్యను దెచ్చుట మొదలగు కథలను దెలిసి యుందురు. ఆదేశమందు ముందు నేఁ జెప్పిన విశాలా పట్టణ మున్నది దానియందు సంపద యెక్కువ. మఱియు స్వర్గానుభ వము జేయువారి యొక్క పుణ్యఫలము కొంచెము ఉండఁగా నాస్వర్గసౌఖ్య మనుభవించుటకుఁ దెచ్చిన స్వర్గఖండమో! అను నట్లు (అనఁగా స్వర్గతుల్యముగా) నున్నది.

ప్రాప్యేతి.—విదన్తీతి విదాః * ఇగుపధలక్షణః కః, ఓకసో వేద స్థానస్య విదాః కోవిదాః *ఓకారలోపః పృషోదరాదిత్వా త్సాధుః, ఉద

యనస్య వత్సరాజస్య కథానాం వాసవదత్తాహరణాద్యత్యద్భుతోపాఖ్యానానాం, కోవిదాః తత్త్వజ్ఞాః, గ్రామేషు యే వృద్ధాస్తే సన్తి యేషు తాన్, అవన్తీన్ తన్నామజనపదాన్, ప్రాప్య, తత్ర, పూర్వోద్దిష్టాం పూర్వోక్తాం 'సౌధోత్సఙ్గప్రణయవిముఖో మాస్మభూ రుజ్జయిన్యా' ఇత్యుక్తాం, శ్రీవిశాలాం సంపత్తిమహతీం, 'శోభా సంపత్తిపద్మాసు లక్ష్మీః శ్రీరివ దృశ్యతే' ఇతి శాశ్వతః, విశాలాంపురీం ఉజ్జయినీం. అనుసర వ్రజ. కథమివ స్థితామ్? సుచరితఫలే పుణ్యఫలే, స్వర్గభోగలక్షణే, స్వల్పీభూతే అల్పావశిష్టే సతీత్యర్థః, గామ్ ఇలాం, గతానాం 'గౌరిలా కుమ్భినీ క్షమా', ఇత్యమరః. పునరపి భూలోకభాజామిత్యర్థః, స్వర్గిణాం స్వర్గవతాం జనానాం శేషైః భుక్తావశిష్టైః పుణ్యైః సుకృతైః, హృతమ్ ఆనీతం, స్వర్గార్థానుష్ఠితకర్మశేషాణాం స్వర్గవ్యాసస్యావశ్యంభావాదితి భావః, కాన్తిరస్యాస్తీతి, కాన్తిమత్ ఉజ్జ్వలం, సాగభూత మిత్యర్థః. ఏకం ముఖ్యం, యద్వా భుక్తాదన్యత్, 'ఏకే ముఖ్యాన్యకేవలా' ఇత్యమరః. దివః స్వర్గస్య. ఖణ్డమివస్థితామిత్యుత్ప్రేక్షా. ఏతేనాతిక్రాన్తసకలభూలోక నగరసౌభాగ్యసారవత్త్వముజ్జయిన్యా వ్యజ్యతే.

దీర్ఘీకుర్వన్ పటు మదకలం కూజితం సారసానాం
ప్రత్యూషేషు స్ఫుటితకమలామోదమైత్రీకషాయః,
యత్ర స్త్రీణాం హరతి సురతగ్లానిమఙ్గానుకూలః
శిప్రావాతః ప్రియతమ ఇవ ప్రార్థనాచాటుకారః. 32

టీ. యత్ర=ఏవిశాలా పట్టణమందు, ప్రత్యూషేషు=ప్రభాత కాలముల యందు, పటు = స్ఫుటమయి, మద కలం; మద = మదముచే, కలం = అవ్యక్త మధురమైన, సారసానాం = బెగ్గురుపక్షుల యొక్క, కూజితం = ధ్వనిని, దీర్ఘీకుర్వన్ = పొడవుగాఁ జేయుచున్నది యై, (ప్రియురాలికి చాటు వాక్యములఁ జెప్పుచు ఆ వాక్యముల ననుసరించు పెంపుడు చిలుకలు మున్నగు పక్షులయొక్క ధ్వనులను ఎడతెగకుండునట్లు చేయుచున్నవాఁడని భావము). స్ఫుటిత కమలామోద మైత్రీ కషాయః; స్ఫుటిత = విక

సించిన, కమల=పద్మములయొక్క, ఆమోద=పరిమళముతో, మైత్రీ=కూడు టచే, కషాయః = సుగంధమైన (పరిమళము గలవాఁడని భావము), అఙ్గాను కూలః=తిన్నఁగా వీచుటఁ జేసి శరీరమునకు సుఖముగాసోఁకునట్టి. (గట్టిగా ఆలింగనముఁ జేసికొని దేహమునకు సుఖమును గలిగించునట్టి వాఁడని భావము.) శిప్రావాతః=శిప్రయను నది యొక్క (చల్లని) గాలి, ప్రార్థనా చాటుకారః; ప్రార్థనా=రతిని సూచించుట యందు, చాటుకారః=ప్రియ వచనములు బలుక్కునట్టి, ప్రియతమ ఇవ = కాంతుని వలెనే. స్త్రీణాం = స్త్రీలయొక్క, సురతగ్లానిం = రతిశ్రమను, హరతి = పోఁగొట్టుచున్నదో.

తా. ఆ విశాలా పట్టణ సమీప మందలి తామర పూవులు గల శిప్రానది గాలి వేకువను శైత్యసౌరభ్యమాంద్య ములతోఁ గూడి రతి శ్రమగల స్త్రీల దేహమును సోఁకి సుఖ ముగా వారి శ్రమ దీర్చి మరల రతిగోరు ప్రియుని వలె స్త్రీలకు భోగాభిలాషఁ బుట్టించు నని భావము.

దీర్ఘీకుర్వన్నితి.—యత్ర విశాలాయాం, ప్రత్యూషేషు అహర్ము ఖేషు. 'ప్రత్యూషోఽహర్ముఖం కల్య' మిత్యమరః. పటు ప్రస్ఫుటం, మద కలం మదేనావ్యక్తమధురం. 'ధ్వనౌ తు మధురాస్ఫుటే కలః' ఇత్యమరః, సారసానాం పక్షివిశేషాణాం, 'సారసో మైథునీ కామీ గోనర్దః పుష్కరా హ్వయః' ఇతి యాదవః. యద్వా, సారసానాం హంసానాం, 'చక్రాఙ్గః సారసో హంసః' ఇతిశబ్దార్ణవే, కూజితం రుతం. దీర్ఘీ కుర్వన్ సంతానయ న్నిత్యర్థః, యావద్వాతం శబ్దానువృత్తేరితి భావః, ఏతేన ప్రియతమః స్వచా టువాక్యానుసారి క్రీడాపతత్రికూజిత మవిచ్ఛిన్నీకుర్వ న్నితిచ గమ్యతే. స్ఫుటి తానాం వికసితానాం, కమలానాం, ఆమోదేన పరిమళేన సహ యా మైత్రీ సంసర్గః, తేన, కషాయః సురభిః, 'రాగద్రవ్యే కషాయోఽస్త్రీ నిర్యాసేసౌర భేరసే' ఇతియాదవః, అన్యత్ర విమర్దగన్ధి త్యర్థః. విమర్దోత్థే పరిమళే గన్ధే జనమనోహరే, ఆమోదః సోఽతినిర్హారీ' ఇత్యమరః. అఙ్గానుకూలః మాన్ద్యాత్ గాత్రసుఖస్పర్శః, అన్యత్ర గాఢాలిఙ్గనదత్తగాత్రసంవాహనఇత్యర్థః. భవ

భూతినా చోక్తమ్. 'అశిథిలపరిరమ్భైర్దత్తసంవాహనాని' ఇతి, సంవాహ్యా స్తేచ సురతశ్రాన్తాః ప్రియైర్యువతయః, ఏతత్కవి రేవ వక్ష్యతి, 'సంభోగాన్తే మమ సముచితో హస్తసంవాహనానాం' ఇతి, శిప్రానామ కాచిత్తత్రత్యా నదీ, తస్యా వాతః, శిప్రావాతః, శిప్రాగ్రహణం శైత్యద్యోతనార్థం, ప్రార్థనా సురతయాచ్ఞా తత్ర చాటు కరోతీతి తథోక్తః, పునః సురతార్థం ప్రియవచనప్రయోక్తేత్యర్థః * కర్మణ్యణ్ప్రత్యయః; ప్రియతమః వల్లభ ఇవ, స్త్రీణాం, సురతగ్లానిం పూర్వరతిఖేదం, హరతి నుదతి, చాటూక్తిభి ర్విస్మృతపూర్వరతిఖేదాః స్త్రియః ప్రియతమ ప్రార్థనాం సఫలయన్తీతిభావః. 'ప్రార్థనాచాటుకారః' ఇత్యత్ర 'ఖణ్డితనాయికానునేతా' ఇతి వ్యాఖ్యానే సురతగ్లానిహరణం న సంభవతి, తస్యాః పూర్వం సురతాభావాత్, పశ్చాత్తస్య సురతగ్లానిహరణం తు నేదానీన్తనకోపశమనార్థచాటువచనసాధ్య మిత్యుపేక్ష్యం వాచితా వివేకినాం; 'జ్ఞాతేఽన్యాసఙ్గవికృతే ఖణ్డితేర్ష్యాకషాయితా' ఇతి దశరూపకే.

హారాంస్తారాం స్తరళగుటికా న్కోటిశః శఙ్ఖశుక్తీః
శష్పశ్యామాన్మరకతమణీనున్మయూఖప్రరోహాన్,
దృష్ట్వా యస్యాం విపణిరచితాన్విద్రుమాణాం చ భఙ్గా
న్సంలక్ష్యన్తే సలిలనిధయ స్తోయమాత్రావశేషాః ౩౩

టీ. (ఇఁక మూఁడు శ్లోకములు ప్రక్షిప్తములు) యస్యాం=ఏవిశాలా పట్టణమందు, కోటిశః = కోట్లకొలఁది, విపణిషు = అంగడివీధుల యందు, రచితాన్ = పెట్టఁబడి యున్న, తారాన్ = శుద్ధములైన, తరళగుటికాన్ = నాయకరత్నములను, హారాన్ = ముత్యాల హారములను, శఙ్ఖశుక్తీః = శంఖములను ముత్యపు చిప్పలను, శష్పశ్యామాన్; శష్ప = పచ్చికవలె, శ్యామాన్ = (శ్యామ అనుపచ్చ) వర్ణము గలిగి, ఉన్మయూఖప్రరోహాన్; ఉన్మయూఖ=ఎక్కువ కాంతులయొక్క, ప్రరోహాన్ = మొలకలుగల (అనఁగా కాంతులు పైకి మొలకలెత్తుచు మిక్కిలి వెలుంగుచున్న). మరకత మణీన్ = గరుడ పచ్చలను, విద్రుమాణాం = పగడములయొక్క, భఙ్గాన్ =

ఖండములను, దృష్ట్వా = చూచి, సలిల నిధయః = సముద్రములు, తోయ మాత్రావశేషాః; తోయమాత్ర=ఉదకము మట్టుకే, అవశేషాః=మిగతగలవిగా, సంలక్ష్యన్తే=ఊహింపఁబడుచున్నవో.

తా. ఆవిశాలా పట్టణః పంగళ్లలో కోటుల కొలంది యుంచఁబడిన శ్రేష్ఠంబగు రత్నములఁ జూచి జనులు సముద్రములలో నుదకముతప్ప రత్నములు లేవు. ఏమన అన్ని సముద్రములలోని రత్నములు చేరిగదా యింతలేసి రాసులగును అని యెంచుచుందురు. (అనఁగా నక్కడి రత్నసంపద సముద్రములకన్న నెక్కుడని భావము.)

ఇతఃపరం ప్రక్షిప్తమపి శ్లోకత్రయం వ్యాఖ్యాయతే.—.

హారానితి. యస్యాం విశాలాయాం, కోటిశో విపణిషు పణ్యవీథికాసు, 'విపణిః పణ్యవీథికా' ఇత్యమరః, రచితాన్ ప్రసారితాన్, ఇదం విశేషణం యథాలిఙ్గం. సర్వత్ర సంబధ్యతే తారాన్, శుద్ధాన్, 'తారో ముక్తాది సంశుద్ధౌ తరణే శుద్ధమౌక్తికే' ఇతి విశ్వః. తరల గుటికాన్ మధ్యమణిభూత మహారత్నాన్, 'తరలో హారమధ్యగః' ఇత్యమరః. 'పిణ్డే మణౌ మహారత్నే గుటికా బద్ధపారదే' ఇతి శబ్దార్ణవే. హారాన్ ముక్తావళీః, తథా, కోటిశః. శఙ్ఖాన్ కమ్బూంశ్చ శుక్తీశ్చ ముక్తాస్ఫోటాంశ్చ. 'ముక్తాస్ఫోటః స్త్రియాం శుక్తిః శఙ్ఖః స్యాత్కమ్బురస్త్రియాం' ఇత్యమరః. ఘాసః బాలతృణం, తద్వచ్ఛ్యామాన్, 'శష్పం బాలతృణం ఘాసో యవసం తృణ మర్జున' మిత్యమరః. ఉన్మయూఖప్రరోహాన్ ఉద్గతరశ్మ్యఙ్కురాన్, మరకతమణీన్ గారుడరత్నాని, తథా, విద్రుమాణాం భఙ్గాన్-ప్రవాళ ఖణ్డాంశ్చ, దృష్ట్వా, సలిలనిధయః సముద్రాః, తోయమాత్రోఽవశేషోయేషాం తే తాదృశాః సంలక్ష్యం తే తథానుమీయన్త ఇత్యర్థః, రత్నాకరాదప్యతిరిచ్యతే రత్నసంపద్భిరితి భావః.

ప్రద్యోతస్య ప్రియదుహితరం వత్సరాజోఽత్ర జహ్రే
హైమం తాలద్రుమవనమభూదత్ర తస్యైవ రాజ్ఞః,

అత్రోద్భ్రాన్తః కిల నళగిరిః స్తమ్భముత్పాట్య దర్పా
దిత్యాగన్తూన్రమయతి జనో యత్ర బన్ధూనభిజ్ఞః. 34

టీ. అత్ర=ఇచ్చట, వత్సరాజః = వత్సదేశపు ఱేఁడు, (ఉదయనుఁడు) ప్రద్యోతస్య=ప్రద్యోతనుఁడను విశాలాపురనాథునియొక్క ప్రియదుహితరం=ముద్దుబిడ్డను (వాసవదత్తను), జహ్రే=హరించెను. అత్ర = ఇక్కడ, తస్యైవ రాజ్ఞః=ఆరాజుయొక్కయే, హైమం=బంగారుదైన, తాళద్రుమ వనం=తాటితోఁపు, అభూత్=ఉండెను. అత్ర=ఇక్కడ, నళగిరిః=నలగిరి యను (ప్రద్యోతనుఁ డింద్రునిచే పొందఁబడిన) ఏనుఁగు, దర్పాత్ = మదముచే, స్తంభం = కట్టుగంబమును, ఉత్పాట్య=పెల్లగించి, ఉద్భ్రాంతఃకిల=ఎగురుచుఁ దిరిగెనఁట, ఇతి=అని (ఇట్టికథలచే) అభిజ్ఞః = పూర్వపుగథలను తెలిసిన, జనః=జనము, ఆగంతూన్=దేశాంతరమునుండి వచ్చిన. బంధూన్=బంధువులను,యత్ర = ఏ విశాలాపట్టణమునందు, రమయతి=వినోదపఱచుచున్నదో.

తా. ఆ విశాలా పురియందు తమ యిండ్లకు వచ్చిన బంధుమిత్రాదులకా పురవాస్తవ్యులు తొల్లి యచ్చటచ్చట జరిగిన కథలను దెల్పి వినోదింపుచుందురు. (అనఁగా నాపట్టణ మద్భుతచరిత్రల కునికిపట్టు గావున జూడఁదగిన దనిభావము.)

ప్రద్యోతస్యేతి.—అత్ర ప్రదేశే; వత్సరాజః వత్సదేశాధీశ్వర ఉదయనః, ప్రద్యోతస్య ప్రద్యోతనామ్నః ఉజ్జయినీనాయకస్య రాజ్ఞః, ప్రియదుహితరం వాసవదత్తాం జహ్రే జహార, అత్ర స్థలే, తస్యైవ రాజ్ఞః ప్రద్యోతస్య, హైమం సౌవర్ణం, తాళద్రుమవన మభూత్, అత్ర నళగిరిర్నా మేన్ద్రదత్తస్తదీయో గజః. దర్పాత్ మదాత్, స్తమ్భం ఆలానం, ఉత్పాట్య ఉద్ధృత్య, ఉద్భ్రాన్తః ఉత్ప్లుత్య భ్రమణం కృతవాన్ కిల, ఇతి ఇత్థం భూతాభిః కథాభి రిత్యర్థః, అభిజ్ఞః పూర్వోక్తకథాకోవిదో జనః, ఆగన్తూన్ దేశాన్తరాదాగతాన్ * 'సిత నిగమి' త్యాదినా ఔణాదికస్తున్ప్ర

త్యయః. బన్ధూ న్యత్ర విశాలాయాం, రమయతి వినోదయతి. అత్ర భావికా లంకారః తదుక్తమ్—'అతీతానాగతం యత్ర ప్రత్యక్షత్వేన లక్ష్యతే. అత్య ద్భుతార్థ కథనా ద్భావికం త దుదాహృతం' ఇతి.

పత్త్రశ్యామా దినకరహయస్పర్ధినో యత్ర వాహాః
శైలోదగ్రాస్త్వమివ కరిణో వృష్టిమన్తః ప్రభేదాత్,
యోధాగ్రణ్యః ప్రతిదశముఖం సంయుగే తస్థివాంసః
ప్రత్యాదిష్టాభరణరుచయశ్చన్ద్రహాసవ్రణాజ్కైః 35

టీ. యత్ర = ఏ విశాలా నగరియందు, వాహాః = గుఱ్ఱములు, పత్త్రశ్యామాః=ఆకుపచ్చని రంగుగలవి గనుకనే, దినకర హయస్పర్ధినః; దినకర = సూర్యునియొక్క, హయ = గుఱ్ఱములతో, స్పర్ధినః = ఒరిపిడి గలవి (అనఁగా సమాన మైనవి.) శైలోదగ్రాః; శైల = కొండలవలె, ఉదగ్రాః=ఉన్నతము లైన, కరిణః=ఏనుఁగులు, ప్రభేదాత్ = మదము గారుటవలన, త్వమివ = నీవలె, వృష్టిమన్తః = వర్షముగలవి, యోధాగ్రణ్యః = భటశ్రేష్ఠులు, సంయుగే=యుద్ధమునందు, ప్రతిదశముఖం = రావణాసురున కెదురుగా, తస్థివాంసః=నిలిచినవారు గనుకనే, చన్ద్రహాసవ్రణాజ్కైః; చన్ద్రహాస = రావణుని ఖడ్గముచే నైన, వ్రణ=గాయములయొక్క, అజ్కైః= చిహ్నములచేత, ప్రత్యాదిష్టాభరణ రుచయః: ప్రత్యాదిష్ట=తిరస్కరింపఁ బడిన, ఆభరణ= భూషణములయొక్క, రుచయః = కాంతి గలవారుగా, భవన్తి = అగుచున్నారో.

తా. అక్కడి గుఱ్ఱము లాకుపచ్చ వన్నె రంగు గలిగి శీఘ్రగమనము గలవి. అక్కడి యేనుఁగులు నీవు వర్షించినట్లు మదజలమును వర్షించునవి. అక్కడి వీరులు రావణాసురునితో పోరి యాతని చంద్రహాసము దెబ్బల కోర్చిన శూరులు. ఇట్టి సర్వోత్కృష్టమైన పట్టణ మవశ్యము చూడ వలయును.

పత్త్రేతి.—హే జలద, యత్ర విశాలాయాం, వాహాః హయాః, పత్త్రశ్యామాః పలాశవర్ణాః అతఏవ, దినకరహయస్పర్ధినః వర్ణతో వేగతశ్చ సూర్యాశ్వకల్పాః తథా, శైలోదగ్రాః శైలవదున్నతాః. కరిణః, ప్రభేదాత్ మదస్రావాద్ధేతోః, త్వమివ, వృష్టిమన్తః. అగ్రం నయన్తీత్యగ్రణ్యః *'సత్సూద్విష' ఇత్యాదినా క్విప్ *'అగ్రగ్రామాభ్యాం నయతేః' ఇతివక్తవ్యాణ్ణత్వం, యోధానామగ్రణ్యః భటశ్రేష్ఠాః, సంయుగే యుద్ధే. ప్రతిదశముఖం అభిరావణం తస్థివాంసః స్థితవన్తః అతఏవ, చన్ద్రహాసస్య రావణాసేః, వ్రణాః క్షతాన్యేవ, అఙ్కాః చిహ్నాని, తైః. 'చన్ద్రహాసో రావణాసౌ వసిమాత్రేఽపి చ క్వచిత్' ఇతి శాశ్వతః. ప్రత్యాదిష్టాభరణరుచయః ప్రతిషిద్ధ భూషణకాన్తయః, శస్త్రప్రహారా ఏవ వీరాణాం భూషణమితి భావః. అత్రాపి భావికాలంకారః.

జాలోద్గీర్ణై రుపచితవపుః కేశసంస్కారధూపై
ర్బన్ధుప్రీత్యా భవనశిఖిభిర్దత్తనృత్తోపహారః,
హర్మ్యేష్వస్యాః కుసుమసురభిష్వధ్వఖేదం నయేథాః,
పశ్యన్ లక్ష్మీం లలితవనితాపాదరాగాఙ్కితేషు. 36

టీ. జాలోద్గీర్ణైః = గవాక్షలనుండి బయలు వెడలిన, కేశసంస్కారధూపైః=కురులకు వాసన బట్టెడుధూపములచేత, ఉపచితవపుః=వృద్ధిఁబొందింపఁబడిన దేహముగల వాఁడవై, బన్ధుప్రీత్యా = బంధువను ప్రేమచేత, భవన శిఖిభిః = ఇండ్లయం దుండు నెమిళ్లచేత, దత్త నృత్తోపహారః = ఈయఁబడిన యాటయను కానుక గలవాఁడవై. (అనఁగా నీవు నెమిళ్లకు బంధువవు గనుక అవి నీయెదుట నాట్యము సల్పి నీకుఁ బ్రీతి సేయు నని యర్థము) కుసుమ సురభిషు = పూలచేఁ బరిమళించు చున్నవై, లలిత వనితా పాద రాగాఙ్కితేషు; లలిత = సుందరు లగు, వనితా = స్త్రీల యొక్క, పాద = పాదముల యందలి, రాగ = లత్తుకచేత, అఙ్కితేషు = గురు తిడఁబడిన; హర్మ్యేషు = మేడల యందు; అస్యాః = ఈయుజ్జయిని

యొక్క, లక్ష్మీం=సంపదను, పశ్యన్ = చూచుచున్నవాఁడవై, అధ్వ ఖేదం = మార్గాయాసమును, నయేథాః=పోఁగొట్టుకొనుము.

తా. నీవు ఆయుజ్జయినికిఁ బోయినపుడు అచటిస్త్రీలు కేశసంస్కారమునకై చేసికొనిన ధూపములు గవాక్షముల నుండి వెలువడి నీలోఁ గలియును. అప్పుడు నీ దేహమునకుఁ బుష్టి గలుగును. మార్గము నడచి వచ్చినవానికి ఆప్యాయనము గలిగించిన ట్లగును. (ధూమము మేఘమగు నని ముందు చెప్పఁబడి యున్నది గదా) మఱియు నచటి నెమళ్లు బంధువవు గావున నీయెదుట నాట్యము సల్పి నీకు వినోదముఁ జేయును. అంత నీవు మేడలపైఁ గూరుచుండి యా నగరమునందలి యువతుల సౌభాగ్యములను దిలకించి యానందింపఁ గలవు.

జాలోద్గీర్ణైరితి,— జాలోద్గీర్ణైః గవాక్షమార్గనిర్గతైః. 'జాలం గవాక్ష ఆనాయే జాలకే క్షపటే గణే' ఇతి యాదవః. కేశసంస్కారధూపైః వనితా కేశవాసనార్థై ర్గన్ధద్రవ్యధూపైరిత్యర్థః * అత్ర సంస్కారధూపయోస్తాదర్థ్యేఽపి యూపదార్వాదివత్ ప్రకృతివికారత్వాభావా దశ్వఘాసాదివత్ షష్ఠీసమాసో న చతుర్థీ సమాసః ఉపచితవపుః పరిపుష్టశరీరః, తథా. బన్ధు బను రితివా ప్రీత్యా, భవనశిఖిభిః గృహమయూరైః, దత్తోనృత్యమేవోపహార (ఉపాయనం) యస్మై స తథోక్తః, 'ఉపాయన ముపగ్రాహ్య ముపహారస్తథోపదా' ఇత్యమరః. కుసుమైః, సురభిషు సుగంధిషు, లలితవనితాః సున్దరస్త్రియః, 'లలితం త్రిషు సున్దరం' ఇతి శబ్దార్ణవే. తాసాం, పాదరాగేణ చరణలాక్షారసేన, అఙ్కితేషు చిహ్నితేషు, హర్మ్యేషు ధనికభవనేషు. అస్యాః ఉజ్జయిన్యాః, లక్ష్మీం పశ్యన్; అధ్వనా అధ్వగమనేన, ఖేదం క్లేశం, అధ్వశ్రమం, నయేథాః అపనయ.

భర్తుః కణ్ఠచ్ఛవిరితి గణైః సాదరం వీక్ష్యమాణః
పుణ్యం యాయా స్త్రిభువనగురోర్ధామ చణ్డీశ్వరస్య,

ధూతోద్యానం కువలయరజోగన్ధిభిర్గన్ధవత్యా
స్తోయక్రీడానిరతయువతిస్నానతిక్తైర్మరుద్భిః. 37

టీ. భర్తుః=తమ స్వామియొక్క, కణ్ఠచ్ఛవి రితి=కంఠము కాంతివంటి కాంతిగలవాఁడవను హేతువువలన (అనఁగా శివునికంఠమువలె నల్లగ నుండువాఁడవు గనుక), గణైః=ప్రమథగణములచేత, సాదరం=ఆదరణముతోఁగూడ, వీక్ష్యమాణః=పరికించి చూడఁబడినవాఁడవై, త్రిభువన గురోః=ముల్లోకముల కును నాథుఁడైన, చండీశ్వరస్య=చండికాపతి యగు శివునియొక్క, పుణ్యం=పవిత్రమగు, ధామ=స్థానమును, యాయాః=పొందుము, (ఆ పుణ్యక్షేత్రము నకుఁ బొమ్ము, అది ముక్తిక్షేత్రము గాన జన్మసాఫల్య మగునని భావము. ఇంతియకాదు భోగక్షేత్రమును అయియున్నది. ఎట్లనఁగా? ఆక్షేత్రము) కువలయ రజో గన్ధిభిః = కలువపూల పరిమళము గలవియు, తోయక్రీడా నిరత యువతి స్నాన తిక్తైః; తోయ క్రీడా = జలక్రీడలయందు, నిరత = ఆసక్తలయిన, యువతి=జవరాండ్రయొక్క, స్నాన=(చందనాది) స్నానీయ వస్తువులచేత, తిక్తైః = సువాసనగలవియగు, గన్ధవత్యాః=గంధవతీ (మీఁదినుండి వచ్చు) నదియొక్క, మరుద్భిః = వాయువులచేత, ధూతో ద్యానం; ధూత= కదల్పఁబడిన, ఉద్యానం=తోఁటలు గలది.

తా. మఱియు నీకు విశేషలాభము, అది ఈశ్వరుని తావు. నీ దర్శనముచే నీయందు ప్రేమగలిగి ప్రమథులు నీకు సహాయపడుదురు. లౌకికానందమును గల్గు. ఎట్లన ? అచట గంధవతియను కలువపూలు మెండుగానున్న నది గలదు. అందు స్త్రీలు స్నానములు చేయుదురు. వారి స్నానీయ చందనాదుల పరిమళమును కలువ వాసనయుఁ గొనివచ్చు గాలు లుద్యానముఁ గదల్చుచుండును, ఈ మూఁడు విధములైన పరిమళము

లతోఁ జల్లగాలి మెల్లఁగ వీచుచుండును గాన మిగుల సుఖంబు గలుగును.

భర్తురితి.—భర్తుః, స్వామినో నీలకణ్ఠస్య భగవతః, కణ్ఠస్యేవ ఛవిర్యస్యాసౌ కణ్ఠచ్ఛవిః, ఇతి హేతోః, గణైః ప్రమథైః, 'గణాస్తు గణనాయాం స్యాద్గణేశే ప్రమథే చయే' ఇతి శబ్దార్ణవే, సాదరం యథా తథా, వీక్ష్యమాణః సన్, ప్రియవస్తుసాదృశ్యా దపి ప్రియత్వం భవేదితి భావః, త్రయాణాం భువనానాం సమాహారస్త్రిభువనమ్ * 'తద్ధితార్థ—' ఇత్యాదినా సమాసః * 'పాత్రాదిభ్యః ప్రతిషేధో వక్తవ్య' ఇతి స్త్రీలిఙ్గతా ప్రతిషేధః, తస్య గురోః త్రైలోక్యనాథస్య, చణ్డీశ్వరస్య కాత్యాయనీవల్లభస్య పుణ్యం పావనం, ధామ మహాకాళాఖ్యం స్థానం, యాయాః, గచ్ఛ * విధ్యర్థే లిఙ్ శ్రేయస్కరత్వా త్సర్వథా యాతవ్యమితి భావః, ఉక్తంచ స్కాన్దే "ఆకాశే తారకం లిఙ్గం పాతాళే హాటకేశ్వరం, మర్త్యలోకే మహాకాళం దృష్ట్వా కామ మవాప్నుయాత్' ఇతి. న కేవలం ముక్తిస్థాన మిదం కిన్తు విలాసస్థాన మపీత్యాహ-ధూ మేతి. కువలయరజోగన్ధిభిః ఉత్పలపరాగగన్ధవద్భిః, తోయక్రీడాసు జలవిహారేషు, నిరతానామ్ ఆసక్తానాం, యువతీనాం, స్నానం స్నాత్యనేనేతి స్నానీయం చన్దనాది * కరణే ల్యుట్ * 'స్నానీయేఽభిషవే స్నానమ్' ఇతి యాదవః. తేన, తిక్తైః సురభిః * 'కటుతిక్తకషాయాస్తు సౌరభ్యేఽపి ప్రకీర్తితాః' ఇతి హలాయుధః. సౌగన్ధ్యాతిశయార్థం విశేషణద్వయం, గన్ధవత్యా నామనద్యాస్తత్రత్యాయా, మరుద్భిః మారుతైః, ధూతోద్యానం కమ్పితాక్రీడ మితి ధామ్నో విశేషణమ్.

అప్యన్యస్మిఞ్జలధర మహాకాళమాసాద్య కాలే
స్థాతవ్యం తే నయనవిషయం యావదత్యేతి భానుః,
కుర్వన్సన్ధ్యాబలిపటహతాం శూలినః శ్లాఘనీయా
మామన్ద్రాణాం ఫలమవికలం లప్స్యసే గర్జితానామ్. 38

టీ. జలధర = మేఘుఁడా! మాహాకాళం = ముందు చెప్పిన చండీశ్వర స్థానమును, అన్యస్మిన్ కాలేఽపి=ఇతర సమయముల యందును, ఆసాద్య = పొంది, తే=నీకు (నీవు), స్థాతవ్యం = ఉండఁదగినది; యావత్ = ఎంతలో, భానుః = సూర్యుఁడు, నయన విషయం = చూచుమార్గమును, అత్యేతి = అతిక్రమించుచున్నాఁడో, (అనఁగా సూర్యుఁ డస్తమించు వఱకును నీ వాచండీశ్వరుని స్థానమునం దుండుము అని యర్థము.) శ్లాఘనీయాం=కొనియాడఁదగిన, శూలినః = ఈశ్వరునియొక్క, సన్ధ్యాబలి పటహతాం; సన్ధ్యా = సంధ్యావేళయందలి, బలి= పూజయందు, పటహతాం=(వాయించెడు) తప్పెట యగుటను, కుర్వన్ = చేయుచు (అనఁగా సాయంకాలపూజయం దుఱుముచున్నవాఁడవై), ఆమన్ద్రాణాం=కొంచెముగ గంభీరములైన, గర్జితానాం = ఉఱుములయొక్క, అవికలం = తక్కువకాని, ఫలం = ప్రయోజనమును, లప్స్యసే = పొందఁగలవు.

తా. మేఘుఁడా! నీ మహాకాల క్షేత్రమునందు సాయంకాలముదనుక యుండి యా సమయమునఁ బరమేశ్వరునికిఁ బూజ జరగుచుండఁగా ఉఱిమితి వేని పటహాములు వాయించి నట్లుండును. నీకు గంభీరము లైన యుఱుము లున్నందుకు భగవత్సన్నిధిలో నుపయోగించుట పరమ శ్రేయోలాభము కలుగును.

అపీతి.—హే జలధర, మహాకాళం నామ పూర్వోక్తం చణ్డీశ్వర స్థానం, అన్యస్మిన్ సంధ్యాతిరిక్తే, కాలే, ఆసాద్య ప్రాప్యాపి, తే (తవ) స్థాతవ్యమ్, త్వయా స్థాతవ్య మిత్యర్థః. *'కృత్యానాం కర్తరివా' ఇతి షష్ఠీ, యావత్ యావతా కాలేన భానుః సూర్యః, నయనవిషయం దృష్టిపథం, అత్యేతి అతిక్రామతి, అస్తమయాత్ తే స్థాతవ్య మిత్యర్థః. యావది త్యవధ్యర్థే * 'యావత్తావచ్చ సాకల్యేఽవధౌ మానేఽవధారణే' ఇత్యమరః. కిమర్థ మత ఆహ, 'కుర్వన్నితి—శ్లాఘనీయాం ప్రశస్యాం, శూలినః శివస్య, సంధ్యాయాం బలిః (పూజా) తత్ర పటహతాం, కుర్వన్ సంపాదయన్

ఆమన్ద్రాణాం ఈషద్గమ్భీరాణాం, గర్జితానాం, అవికలం అఖణ్డం, ఫలం, లప్స్యసే ప్రాప్స్యసి. లభేః కర్తరి లృట్. మహాకాళనాథబలిపటహత్వేన ఏని యోగాత్తే గర్జితానాం సాఫల్యం స్యాదిత్యర్థః.

పాదన్యాసక్వణితరశనా స్తత్ర లీలావధూతై
రత్నచ్ఛాయాఖచితవలిభిశ్చామరైః క్లాన్తహస్తాః,
వేశ్యా స్త్వత్తో నఖపదసుఖాన్ప్రాప్య వర్షాగ్రబిన్దూ
నామోక్ష్యన్తే త్వయి మధుకరశ్రేణిదీర్ఘాన్కటాక్షాన్. 39

టీ. తత్ర = ఆ సంధ్యాపూజయందు, పాద న్యాస క్వణిత రశనాః; పాదన్యాస=నాట్యమునం దడుగులుంచుటచేత, క్వణిత రశనాః=మ్రోఁగుచున్న మొలనూళ్లుగలవారును లీలావధూతైః=విలాసముచేత వీవఁబడిన. రత్నచ్ఛాయా ఖచిత వలిభిః; రత్న=రత్నములయొక్క, ఛాయా = కాంతులచేత, ఖచిత = కప్పఁబడిన, వలిభిః = కాఁడలుగల, చామరైః చామరములచేత, క్లాన్త హస్తాః; క్లాన్త=బడలిన, హస్తాః=హస్తములుగలవారైన, వేశ్యాః = వేశ్యలు, త్వత్తః= నీవలన, నఖపద సుఖాన్=నఖక్షతములందు సుఖకరములగు, వర్షాగ్ర బిన్దూన్= వానయొక్క మొదటిచినుకులను (అనఁగా మొట్టమొదటకురిసిన చినుకు వారి నఖక్షతములమీఁదఁ బడఁగనే బహుసుఖము గలుగును.) ప్రాప్య = పొంది, త్వయి=నీయందు, మధుకరశ్రేణి దీర్ఘాన్ = తుమ్మెదలబారులవలెనె పొడవులైన, కటాక్షాన్=కడగంటిచూపులను, ఆమోక్ష్యన్తే=ఉంచఁగలరు.

తా. సాయంకాల పూజయందు వేశ్యలు నాట్యము జేయుచు చామరములతో స్వామికి వీచుచుందురు. నీవు వారి నఖక్షతములమీఁదఁ బడునట్లు చల్లఁగా నుదకబిందువులను వర్షించితివేని వారు క్రేగంటిచూపులతో నిన్నుఁ జూతురు. అది నీకు అత్యంత మానందదాయక మగును.

పాదన్యాసేతి — తత్ర సన్ధ్యాబలౌ, పాదన్యాసైః చరణనిక్షేపై ర్నృత్యాఙ్గైః, క్వణితాః శబ్దాయమానాః, రశనాః యాసాం తాః తథోక్తాః, క్వణతే రకర్మకత్వాత్ * 'గత్యర్థాకర్మక' ఇత్యాదినా కర్తరి క్తః. లీలయా విలాసేన, అవధూతైః కమ్పితైః, రత్నానాం, కఙ్కణమణీనాం, ఛాయయా కాన్త్యా, ఖచితాః రూషితాః. వలయః చామరదణ్డాః యేషాం తైః * 'వలి శ్చామరదణ్డే చ జరావిశ్లథచర్మణి' ఇతి విశ్వః. చామరైః వాలవ్యజనైః, క్లాన్తహస్తాః, ఏతేన దైశికనృత్యం సూచితం, తదుక్తం నృత్యసర్వస్వే.— * 'ఖడ్గకన్దుక వస్త్రాది దణ్డికా చామర స్రజః, వీణాది ధృత్వా యత్కుర్యా న్నృత్యం తద్దైశికం భవేత్' ఇతి. వేశ్యాః మహాకాళనాథ ముపేత్య నృత్యన్త్యో గణికాః, త్వత్తః, నఖపదేషు నఖక్షతేషు సుఖాన్ సుఖకరాన్ * సుఖశబ్దా త్తత్కరోతీతి ణ్యన్తాత్ పచాద్యచ్, యద్వా, సుఖాన్ సుఖహేతూన్ * 'సుఖహేతౌ సుఖే సుఖం' ఇతి శబ్దార్ణవే, వర్షస్య అగ్రబిన్దూన్ ప్రథమబిన్దూన్, ప్రాప్య, త్వయి, మధుకరశ్రేణిదీర్ఘాన్ కటాక్షాన్ అపాఙ్గాన్, ఆమోక్ష్యన్తే, 'పరై రుపకృతాః సన్తః సద్యః ప్రత్యుపకుర్వతే' ఇతి భావః. కామినీ దర్శనీయత్వలక్షణం శివోపాసనాఫలం సద్యో లప్స్యస ఇతి ధ్వనిః.

పశ్చాదుచ్చైర్భుజతరువనం మణ్డలేనాభిలీనః
సాన్ధ్యం తేజః ప్రతినవజపాపుష్పరక్తం దధానః,
నృత్యారమ్భే హర పశుపతేరార్ద్రనాగాజినేచ్ఛాం
శాన్తోద్వేగస్తిమితనయనం దృష్టభక్తిర్భవాన్యా. 40

టీ. పశ్చాత్ = తరువాత (సాయంకాల పూజానంతరమందు), పశుపతేః = ఈశ్వరునియొక్క, నృత్యారమ్భే = నాట్యమాడ దొరఁకొను నప్పుడు, ప్రతి నవ జపా పుష్ప రక్తం = క్రొత్త దాసానిపూవువలెనే యెఱ్ఱనైన, సాన్ధ్యం = సంధ్యవేళయందలి, తేజః=కాంతిని, దధానః = ధరించుచున్నవాఁడవై, ఉచ్చైః = ఎత్తైన, భుజతరు వనం; భుజ = భుజముల నెడు, తరు = చెట్లయొక్క, వనం = తోఁపును, మణ్డలేన = వర్తులాకారముచేత,

అభిలీనః = అంతటను వ్యాపించినవాఁడవై, భవాన్యా = ఆ చండికాదేవి చేత, శాన్తోద్వేగ స్తిమిత నయనం; శాన్తోద్వేగ = భయము లేనివి గనుకనే, స్తిమిత = నిశ్చలములైన, నయనం = నేత్రములు గలుగునట్లు, దృష్టభక్తిః= చూడఁబడిన భక్తిగలవాఁడవై, పశుపతేః = రుద్రునికి, ఆర్ద్రనాగాజినేచ్ఛాం; ఆర్ద్ర = (రక్తముచేత) తడిసిన, నాగాజిన = గజచర్మమునందలి, ఇచ్ఛాం= కోరికను, హర=తీర్పుమా.

తా. సాయంకాలపూజ పిదప శివుఁడు తాండవ మాడును. అప్పు డాయన యెత్తిన చేతులమీఁద సంధ్యారాగము గల నీవు వ్రాలఁగా రక్తాంకిత గజాసురచర్మ కన్న రమణీయముగ నున్న నిన్నుఁ జూచి గజాసురచర్మము నపేక్షింప కుండును. అమ్మవారు చర్మనుజూచి నప్పటివలె భయపడక నిన్ను వేడుకగాఁ జూతురు. వారి యనుగ్రహమునకుఁ బాత్రుండ వగుదువు.

పశ్చాదితి.—పశ్చాత్ సన్ధ్యాబల్యనన్తరం. పశుపతేః శివస్య, నృత్యారమ్భే తాణ్డవప్రారమ్భే, ప్రతినవజపాపుష్పరక్తం ప్రత్యగ్రజపాకుసుమారుణం సన్ధ్యాయామం భవం తేజో దధానః, ఉచ్చైః ఉన్నతం, భుజా ఏవ తరవస్తేషాం వనం. మణ్డలేన మణ్డలాకారేణ, అభిలీనః, అభివ్యాప్తః సన్ * కర్తరి క్తః, భవాన్యా భవపత్న్యా * 'ఇన్ద్ర వరుణ భవ శర్వరుద్ర మృడ హి మారణ్యయవ యవన మాతు లాచార్యాణా మానుక్' ఇతిఙీష్ ఆనుగాగమశ్చ. శాన్తః ఉద్వేగః గజాజినదర్శనభయం యయోస్తే, అత ఏవ, స్తిమితే నిశ్చలే నయనే యస్మిన్కర్మణి తత్తథోక్తమ్ * 'ఉద్వేగ స్త్వరితే క్లేశే భయే మన్థరగామిని' ఇతి శబ్దార్ణవే. భక్తిః పూజ్యేష్వనురాగః * భజేః భావార్థే క్తిన్ప్రత్యయః. దృష్టం దృష్టా వా భక్తిర్యస్య స దృష్టభక్తిః సన్, పశుపతేః, ఆర్ద్రం శోణితార్ద్రం, యన్నాగాజినం గజచర్మ * 'అజినం చర్మకృత్తిః, స్త్రీ' ఇత్యమరః. తత్రేచ్ఛాం. హర నివర్తయ, త్వమేవ తత్ స్థానే భవేత్యర్థః. గజాసురమర్దనానన్తరం భగవాన్మహాదేవస్తదీయ మార్ద్రాజినం భుజమణ్డలేన బిభ్రత్తాణ్డవం

చకారేతి ప్రసిద్ధిః. *దృష్టభక్తి రితి కథం రూపసిద్ధిః, దృష్టశబ్దస్య * 'స్త్రియాః పుంవత్' ఇత్యాది నా పుంవద్భావస్య దుర్ఘటత్వాత్ కుతః * 'పూరణీ ప్రియాది ష్వి'తి నిషేధాత్ భక్తిశబ్దస్య ప్రియాదిషు పాఠా దితి? తదేత చ్చోద్యం దృఢభక్తిరితిశబ్దమాశ్రిత్య ప్రతివిహితం గణవ్యాఖ్యానే 'దృఢం భక్తిరస్యేతి నపుంసకం పూర్వపదమ్ అదార్ఢ్య నివృత్తిమాత్రపరే దృఢశబ్దే లిఙ్గవిశేషస్యానుపకారిత్వాత్ స్త్రీత్వ మవివక్షిత' మితి భోజరాజస్తు * 'భక్తాచ కర్మసాధనాయా' మిత్యనేన సూత్రేణ భజ్యతే సేవ్యత ఇతి కర్మా ర్థత్వే భవానీభక్తిరిత్యాది భవతి, 'భావసాధనాయాం తు స్థిరభక్తి ర్భవాన్యా మిత్యాదిభవతి' ఇత్యాహ, ఇతి తదేతత్సర్వం సమ్యగ్వివేచితం రఘువంశసంజీ విన్యాం 'దృఢభక్తి రితి జ్యేష్ఠే' ఇత్యత్ర. తస్మా ద్దృష్టభక్తి రిత్యత్రాపి మత భేదేన పూర్వపదస్య స్త్రీత్వే నపుంసకత్వే చ రూపసిద్ధి రస్తీతి స్థితమ్.

గచ్ఛన్తీనాం రమణవసతిం యోషితాం తత్ర నక్తం
రుద్ధాలోకే నరపతిపథే సూచిభేద్యై స్తమోభిః,
సౌదామిన్యా కనకనికషస్నిగ్ధయా దర్శయోర్వీం
తోయోత్సర్గ స్తనితముఖరో మాస్మభూర్విక్లబా స్తాః. 41

టీ. తత్ర = ఆయుజ్జయినియందు, నక్తం = రాత్రియందు, రమణ వసతిం=ప్రియుని యింటికి, గచ్ఛన్తీనాం = పోవు చున్న, యోషితాం = (అభిసారిక లగు) స్త్రీలకు సూచిభేద్యైః = సూదులతో భేదింపఁ దగిన (మిక్కిలి దట్టమైన), తమోభిః = చీఁకట్లచేత, రుద్ధాలోకే = అడ్డగింపఁబడిన చూపులు గల (అనఁగా కటికచీఁకటిచేత కొంచెమైనను గనఁబడ నట్టి) నరపతి పథే = రాజమార్గమునందు, కనక నికష స్నిగ్ధయా; కనక = బంగా రము యొక్క. నికష = ఒరగంటియందలి రేఖవలెను, స్నిగ్ధయా = నునుపు గల, సౌదామిన్యా=మెఱుపుచేత, ఉర్వీం=భూమిని, దర్శయ = చూపుము, తోయో త్సర్గ స్తనిత ముఖరః; తోయోత్సర్గ = వర్షించుటచేత, స్తనిత = ఉఱుములచేతను, ముఖరః = మ్రోయువాఁడవు, మాస్మ భూః = కావద్దు

(ఎందు కనఁగా) తాః = ఆస్త్రీలు, విక్లబాః = భయపడువారు. (అందువలన వర్షగర్జనలఁ జేయకు మని భావము.)

తా. ఆయూరిలో నభిసారికా స్త్రీలు తమ ప్రియుల వద్దకుఁ బోవునపుడు కటిక చీఁకటి గ్రమ్మి మార్గము తెలియకుండును. అప్పుడు నీవు మెఱయు చుంటి వేని వారికి మార్గము దెలియును. ఆ యుపకారముఁ జేయుము. ఉఱుముట వద్దు సుమా. వర్షింపను వద్దు. ఉఱిమినను మెఱసినను పాప మా జారిణులు భయము పడుదురు.

ఇత్థం మహాకాళనాథ సేవాప్రకార మభిధాయ పున ర్నగరసంచార మేవాహ.—గచ్ఛన్తీనా మితి. తత్ర, ఉజ్జయిన్యాం, నక్తం రాత్రౌ, రమణ వసతిం ప్రియభవనం ప్రతి * 'వసతీరాత్రి వేశ్మనో' రిత్యమరః. గచ్ఛన్తీనాం యోషితాం, అభిసారికాణా మిత్యర్థః, సూచిభిర్భేద్యైః అతిసాన్ద్రైరిత్యర్థః, తమోభిః, రుద్ధాలోకే నిరుద్ధదృష్టిప్రసారే, నరపతిపథే రాజమార్గే, కనకస్య, నికషో, నికష్యత ఇతి వ్యుత్పత్త్యా నికషోపలగతరేఖా, తస్యేవ, స్నిగ్ధం తేజో, యస్యాస్తయా * 'స్నిగ్ధం తు మసృణే సాన్ద్రే రమ్యే క్లీబే చ తేజసి' ఇతి శబ్దార్ణవే. * సుదామ్నాద్రిణైకదిక్సౌదామనీ విద్యుత్ * 'తేనైకదిక్' ఇత్యణ్ప్రత్యయః. తయా, ఉర్వీం, మార్గం, దర్శయ, కించ, తోయోత్సర్గస్తనితాభ్యాం వృష్టిగర్జితాభ్యాం, ముఖరః శబ్దాయమానః మాస్మభూః, కుతః, తాః యోషితః విక్లబాః భీరవః, తతో వృష్టిగర్జితే న కార్యే ఇత్యర్థః. * నాత్ర తోయోత్సర్గే స్తనిత మితి విగ్రహః, విశిష్టస్యైవ కేవలస్తనితస్యాప్యనిష్టత్వాత్, న చ ద్వన్ద్వపక్షేఽల్పాచ్తరపూర్వనిపాత శాస్త్రవిరోధః * 'లక్షణ హేత్వోః క్రియాయాః' ఇతిసూత్ర ఏవ విపరీత నిర్దేశేన పూర్వనిపాత శాస్త్రస్యానిత్యత్వజ్ఞాపనా దితి.

తాం కస్యాంచిద్భవనవలభౌ సుప్తపారావతాయాం
నీత్వా రాత్రిం చిరవిలసనాత్ ఖిన్నవిద్యుత్కళత్రః,

సూర్యే దృష్టే పునరపి భవాన్వాహయేదధ్వశేషం
మన్దాయన్తే న ఖలు సుహృదామభ్యుపేతార్థకృత్యాః. 42

టీ. చిర విలసనాత్ = చాలసేపు మెఱయుటవలన, ఖిన్న విద్యుత్కళత్రః; ఖిన్న=బడలిన, విద్యుత్ = మెఱుపసెడు, కళత్రః = భార్యగలవాఁడవైన, భవాన్ =నీవు, సుప్త పారావతాయాం; సుప్త=నిద్రించుచున్న, పారావతాయాం=పావురములు గల, కస్యాం చిత్ =ఒకానొక, భవన వలభౌ=కొణిగె (చూరు) యందు (పైభాగమునందు), తాం రాత్రిం=ఆరాత్రిని, నీత్వా=కడపి, సూర్యే=సూర్యుఁడు, దృష్టే=కనపడఁగా, పునరపి=తిరిగి, అధ్వ శేషం=మార్గశేషమును, వాహయేత్ =కడపుము. సుహృదాం=మిత్రులయొక్క, అభ్యుపేతార్థకృత్యాః; అభ్యుపేత = అంగీకరింపఁబడిన, అర్థ=ప్రయోజనముయొక్క, కృత్యాః=కార్యములుగలవారు, న మన్దాయన్తే ఖలు=ఆలస్యము చేయరుగదా.

తా. పూర్వశ్లోకమునందుఁ జెప్పినట్లు నీ భార్యయగు సౌదామిని మెఱసి మెఱసి యలసటఁ జెందును. అంత నామెతోఁ గూడ నీవు ఏదైన నొకయింటిమీఁద శయనించి మార్గాయాసముఁ దీర్చుకొని సూర్యోదయము కాఁగానే తిరిగి ప్రయాణము చేయుము నీవంటివారు మిత్రుల కుపకారము జేయుట కాలస్యము చేయరు గదా!

తామితి.—చిరం, విలసనాత్ స్ఫురణాత్, ఖిన్నం, విద్యుదేవ కళత్రం యస్య స భవాన్, సుప్తాః పారావతాః కలరవా, యస్యాం తస్యాం, వివిక్తాయామిత్యర్థః * 'పారావతః కలరవః కపోతః' ఇత్యమరః. జనసంచార స్తత్రాసంభావిత ఏవేతి భావః, కస్యాంచిత్, భవనస్య, వలభౌ ఆచ్ఛాదనే, ఉపరిభాగ ఇత్యర్థః. 'ఆచ్ఛాదనం స్యాద్వలభీ గృహాణాం' ఇతి హలాయుధః. తాం రాత్రిం నీత్వా, సూర్యే, దృష్టేసతి ఉదితే సతీత్యర్థః. పునరపి, అధ్వశేషం వాహయేత్; తథాహి, సుహృదా

మిత్రాణాం, అభ్యుపేతా అఙ్గీకృతా, అర్థస్య ప్రయోజనస్య, కృత్యా క్రియా, యైస్తే, అభ్యుపేత సుహృదర్థా ఇత్యర్థః * సాపేక్షత్వేఽపిగమకత్వాత్స మాసః * 'కృత్యా క్రియాదేవతయోః కార్యే స్త్రీ కుపితే త్రిషు' ఇతియా దవః. * 'కృఞశ్చ' ఇతి చకారాత్క్యప్, న మన్దాయన్తే ఖలు నమన్దాభవన్తి హి; న విలమ్బన్త ఇత్యర్థః. * 'లోహితాదిడాజ్భ్యః క్యష్, ఇతిక్యష్, * 'వాక్యషః' ఇత్యాత్మనేపదమ్.

తస్మిన్కాలే నయనసలిలం యోషితాం ఖణ్డితానాం
శాన్తిం నేయం ప్రణయిభిరతో వర్త్మ భానో స్త్యజాశు,
ప్రాలేయాస్రం కమలవదనాత్సోఽపి హర్తుం నలిన్యాః
ప్రత్యావృత్తస్త్వయి కరరుధి స్యాదనల్పాభ్యసూయః. 43

టీ. తస్మిన్ కాలే = ఆ (సూర్యోదయ) కాలమునందు, ప్రణయిభిః= ప్రియతములచేత, ఖణ్డితానాం యోషితాం=ఖండిత లను స్త్రీలయొక్క, నయన సలిలం=కన్నీరు, శాన్తిం = శమమును, నేయం = పొందింపఁదగినది, అతః= ఈ కారణము వలన, భానోః = సూర్యునియొక్క, వర్త్మ = మార్గమును, ఆశు = శీఘ్రముగా, త్యజ = విడువుము, సోఽపి = అతఁడును (ఆసూర్యుఁడును లోకులవలె), నళిన్యాః=పద్మినియొక్క (అనఁగా తామరతీఁగయొక్క), (నళిని సూర్యుని ప్రియురాలని భావము.) కమలవదనాత్ =దానియొక్క పుష్పమను మోమునుండి; ప్రాలేయాస్రం = మంచ నెడుకన్నీటిని, హర్తుం= పోఁగొట్టుటకు, ప్రత్యావృత్తః = వచ్చినవాఁడు, (ఈ కారణము వలన) త్వయి=నీవు, కర రుధి=చేతులను (కిరణములను) అడ్డగించి వేని. అనల్పాభ్యసూయః; అనల్ప=ఎక్కువగు, అభ్యసూయః=ద్వేషము గలవాఁడు, స్యాత్ = అగును.

తా. అన్యస్త్రీ రతులయి రాత్రుల దిరిగి యుదయమున వచ్చిన నాథులనుఁ జూచి వెతఁ జెందు నాయికల నూఱడించి కన్నీళ్లఁ దుడుచుట నాయకస్వభావము గదా! అట్లుగానే

సూర్యుఁ డుదయమున రాఁగానే పద్మిని యన్యరతుఁ డని మంచను కన్నీటితోఁ గూడియుండఁగా అవితుడుచుటకు సూర్యుఁడు కిరణములను కరములఁ జాపుచుండును. అప్పుడు నీ వడ్డము పోకుము కోపము వచ్చును. కాముకుల యిష్ట మును జెఱచుటవలన వారితో ద్వేషము వచ్చును. అది శ్రేయోహానికి మూల మని యర్థము.

తస్మిన్నితి.—తస్మిన్కాలే పూర్వోక్తే సూర్యోదయకాలే, ప్రణ యిభిః ప్రియతమైః,ఖణ్డితానాంయోషితాం నాయికావిశేషణామ్ * 'జ్ఞాతేఽ న్యాసఙ్గవికృతే ఖణ్డితేర్ష్యాకషాయితా' ఇతి దశరూపకే, నయన సలిలం శాన్తిం; నేయం నేతవ్యమ్ * నయతే ర్ద్వికర్మకః, అతో హేతోః, భానోః; వర్త్మ మార్గం, ఆశు శీఘ్రం, త్యజ, తస్యావరణం మాభూ రిత్యర్థః; విపక్షేఽ నిష్టమాచష్టే— సోఽపి భానుః; నలాని (అమ్బుజాని) అస్యాః సన్తీతి నలినీ పద్మినీ * 'తృణేఽమ్బుజే నలం నాతు రాజ్ఞి నాలే తు న స్త్రియామ్' ఇతి శబ్దార్ణవే, తస్యాః స్వకాన్తాయాః కమలం స్వకుసుమమేవ వదనం, తస్మాత్, ప్రాలేయం హిమమేవ, అస్రమ్ అశ్రు, హర్తుం శమయితుం. ప్రత్యావృత్తః ప్రత్యాగతః, నళిన్యాశ్చ భర్తుర్భానో ర్దేశాన్తరే నళిన్యన్తరగమనా త్ఖణ్డి తాత్వ మిత్యాశయః, అత స్త్వయి * కరాన్ (అంశూన్) రుణద్ధీతి కర రుత్, క్విప్ తస్మి న్కరరుధి సతి, హస్తరోధిని సతీతి చ గమ్యతే * 'బలి హస్తాంశవః కరాః' ఇత్యమరః, అనల్పాభ్యసూయః అధికవిద్వేషః, స్యాత్, ప్రాయేణేచ్ఛావిశేషవిఘాతా ద్ద్వేషో రోషవిశేషశ్చ కామినాం భవతీతిభావః, కించ* 'బ్రహ్మాణ మర్క మీశానం విష్ణుం వా ద్వేష్టి యో జనః. శ్రేయాంసి తస్య నశ్యన్తి రౌరవం చ భవే ద్ధ్రువమ్.' ఇతి నిషేధా త్కార్యహాని శ్చ భవిష్యతీతి ధ్వనిః.

గమ్భీరాయాః పయసి సరిత శ్చేతసీవ ప్రసన్నే
ఛాయాత్మాపి ప్రకృతిసుభగో లప్స్యతే తే ప్రవేశం,

తస్మా దస్యాః కుముదవిశదా న్యర్హసి త్వం న ధైర్యా
న్మోఘీకర్తుం చటులశఫరోద్వర్తనప్రేక్షితాని. 44

టీ. గమ్భీరాయాః= గంభీర యనెడు, సరితః=నదియొక్క, చేతసీవ=మనస్సువలె, ప్రసన్నే=నిర్మలమయిన, పయసి=ఉదకమునందు, ప్రకృతి సుభగః=స్వభావముచే సుందరమయిన, తే = నీయొక్క, ఛాయాత్మాపి = ప్రతిబింబ స్వరూపమైనను, ప్రవేశం=చేరికను, లప్స్యతే=పొందఁగలదు. తస్మాత్ = ఆ కారణమువలన, అస్యాః= ఈ నదియొక్క, కుముదవిశదాని = తెల్లఁగలువవలె శుభ్రములైన; చటుల శఫరోద్వర్తన ప్రేక్షితాని, చటుల = చంచలములైన, శఫర= మత్స్యములయొక్క, ఉద్వర్తన=పొరలుట లనెడు, ప్రేక్షితాని=చూపులను, త్వం=నీవు, ధైర్యాత్ = మోసమువలన, మోఘీకర్తుం=వ్యర్థముగాఁ జేయుటకు, నార్హసి= తగవు.

తా. పిమ్మట గంభీరయను లోఁతైన నది కనఁబడును. దాని నీరు మిక్కిలి స్వచ్ఛమైనది. (లోఁతైన యభిప్రాయము గల మంచి నాయిక స్ఫురించు చున్నది.) నీయందు మక్కువ గలది గాన దోషము లేనిది. నీవు దానిని బొందుట కిష్టపడక పోయినను నీ ఛాయాశరీరము దానిమనసు (జలము)నం దుండుటచేఁ దప్పక చేరుచున్నది. అనఁగా నిన్నది కామించి మనస్సులోఁ దలంచుచునే యున్నది. అట్లు కామించి చేఁపల పొర్లింతలనెడు చూపులచేఁ నిన్నుఁ జూచుచున్నది గాన దాని యభీష్టమును ద్రోసి వేయకుము.

గమ్భీరాయాఇతి.—గమ్భీరా నామ సరిత్, ఉదాత్తనాయికా చ ధ్వన్యతే, తస్యాః, ప్రసన్నే అనురక్తత్వా ద్దోషరహితే, చేతసీవ, ప్రసన్నే అతినిర్మలే, పయసి. ప్రకృత్యా స్వభావేనైవ, సుభగః సున్దరః * 'సున్దరేఽధికభాగాంశే దుర్దినేతరవాసరే, తురీయాంశే శ్రీమతిచ సుభగః' ఇతి శబ్దార్ణవే, తే తవ, ఛాయా చాసావాత్మా చ సోఽపి, ప్రతిబిమ్బశరీరం వా,

ప్రవేశం లప్స్యతే, అపిశబ్దాత్, సాక్షాత్ప్రవేశ మనిచ్ఛోరపీతి భావః, తస్మాత్ ఛాయాద్వారాపి ప్రవేశ స్యావశ్యంభావిత్వాత్, అస్యాః గమ్భీరాయాః, కుముదవత్, విశదాని ధవళాని, చటులాని శీఘ్రాణి, శఫరాణాం మీనానాం, ఉద్వర్తనాని ఉల్లుణ్ఠనా న్యేవ, ప్రేక్షితాని అవలోకనాని* త్రిషు స్యా చ్చటులం శీఘ్రం' ఇతి విశ్వః;— ఏత దేవ గమ్భీరాయా అనురాగలిఙ్గం, ధైర్యాత్ ధార్ష్ట్యాత్, ధార్ష్ట్యాదితి యావత్, మోఘీకర్తుం విఫలీకర్తుం నార్హసి; నానురక్తా విప్రలబ్ధవ్యేత్యర్థః; ధూర్తలక్షణం తు*'క్లిశ్నాతి నిత్యం దయితామజస్రం స్థా మతిసున్దరః, అన్యాస్వనురక్తాం యత్నేన రక్తాం ధూర్తో విముఞ్చతి' ఇతి,

> తస్యాః కిఞ్చి త్కరధృతమివ ప్రాప్తవానీరశాఖం
> హృత్వా నీలం సలిలవసనం ముక్తరోధోనితమ్బం,
> ప్రస్థానం తే కథమపిసఖే లమ్బమానస్య భావి
> జ్ఞాతాస్వాదో వివృతజఘనాం కో విహాతుం సమర్థః. 45

టీ. సఖే=మిత్రుఁడా ; ప్రాప్తవానీరశాఖం; ప్రాప్త = పొందఁబడిన, వానీర శాఖం=ప్రబ్బలికొమ్మగలది కనుకనే కిఞ్చిత్ =కొంచెము, కరధృత మివ= చేతితో పట్టుకొనఁబడిన దానివలె నున్నదై, ముక్తరోధోనితమ్బం; ముక్త = విడుపఁబడిన, రోధః=తటము నెడు, నితంబం=పిఱుఁదుగల, నీలం=నల్లనైన, సలిల వసనం = ఉదకము నెడు వస్త్రమును, హృత్వా = అపహరించి, లమ్బమానస్య= వ్రేలాడుచున్నట్టి, తే=నీయొక్క, ప్రస్థానం=ప్రయాణము, కథ మపి = కష్ట ముగా, భావి= కాఁగలదు. జ్ఞాతాస్వాదః = రసమును దెలిసిన, కః=ఎవ్వఁడు, వివృత జఘనాం = తెరువఁబడిన మొలగలదానిని, విహాతుం = విడుచుటకు, సమర్థ=చాలినవాఁ డగును.

తా. గంభీరానది జలము ఒడ్డుననుండి దిగఁ జారి ప్రబ్బలిచెట్ల దగ్గర నుండఁగా కాముకురా లగు స్త్రీ వస్త్రము

పోకముడి వీడి దిగ జారుచుండఁగాఁ జేతఁ బట్టుకొని నట్లుం డును. అప్పుడు ఆ యుదకమును గ్రహింపఁగా ఆమె మొల మీఁద వస్త్రము లేనట్లుండును. నీవు అట్టి దానినుండి తప్పి పోవుటకు మనస్సు రాక యుందువు.

తస్యా ఇతి.—హేసఖే, ప్రాప్తా, వానీరశాఖా వేతసశాఖా, యేన తత్తథోక్త, మతఏవ, కించిత్, ఈషత్, కరధృతం హస్తావలమ్బిత, మివస్థితం, ముక్తః త్యక్తః. రోధః తటమేవ నితమ్బః కటిః. ర్యేన తత్తథోక్తం*'నితమ్బః పశ్చిమే శ్రోణిభాగేఽద్రికటకే తటే' ఇతి యాదవః, నీలం కృష్ణవర్ణం, తస్యాః గమ్భీరాయాః సరితః, సలిల మేవ వసనం, నీలామ్బరధారణం విరహ తాపనివారణమితి ప్రసిద్ధిః, హృత్వా అపనీయ, లమ్బమానస్య పీతసలిలభారా ల్లమ్బమానస్య, అన్యత్ర, జఘనారూఢస్య, తే తవ, ప్రస్థానం ప్రయాణం, కథమపి కృచ్ఛ్రేణ, భావి. కృచ్ఛ్రత్వహేతు మాహ జ్ఞాతేతి—జ్ఞాతాస్వాదః అనుభూతరసః, కః పుమాన్, వివృతం ప్రకటీకృతం, జఘనం కటిస్తత్పూర్వ భాగో వా, యస్యాస్తాం*'జఘనం స్యాత్కటౌ పూర్వశ్రోణిభాగాపరాం శయోః ఇతి యాదవః, విహాతుం త్యక్తుం, సమర్థః, శక్తః, న కోఽపీత్యర్థః.

త్వన్నిష్యన్దోచ్ఛ్వసిత వసుధా గన్ధసంపర్క రమ్యః
స్రోతోరన్ధ్రధ్వనితసుభగం దన్తిభిః పీయమానః,
నీచై ర్వాస్య త్యుపజిగమిషో ర్దేవపూర్వం గిరిం తే
శీతో వాతః పరిణమయితా కాననోదుమ్బరాణామ్. 46

టీ. త్వన్నిష్యన్దో చ్ఛ్వసిత వసుధా గన్ధ సమ్పర్క రమ్యః; త్వత్ = నీయొక్క, నిష్యన్ద=వర్షముచేత, ఉచ్ఛ్వసిత=ఊఁటఁజెందిన, వసుధా=భూమి యొక్క, గన్ధ=వాసనయొక్క, సంపర్క=కూడికచేత, రమ్యః = సువాసనగల దియు, స్రోతో రన్ధ్ర ధ్వనిత సుభగం; స్రోతోరన్ధ్ర = నాసారంధ్రముల యొక్క, ధ్వనిత=శబ్దముచేత, సుభగం=వినుట కింపుగా, దన్తిభిః=ఏనుఁగులచేత,

పీయమానః=పానము చేయఁబడుచున్నదియు, కాననోదుమ్బరాణాం = అడవి మేడికాయలను, పరిణమయితా = పండించునదియు నగు, శీతః = చల్లనైన, వాతః=గాలి, దేవపూర్వం గిరిం=దేవగిరిని, ఉప జిగమిషోః = చేరఁబోవుచున్న, తే=నీకు, నీచైః మెల్లఁగా, వాస్యతి=వీవఁగలదు.

తా. ఆ గంభీరానది నుండి వెడలు నపుడు నీ కనుకూలముగా వాయువులు వీచును. ఎట్లనఁగ ! నీవు వర్షించినచోట్ల భూమి పరిమళించును. అట్టిపరిమళముతో నుండును. మఱియు ఏనుఁగులు ఆగంధము నాఘ్రాణించు చుండును. అప్పుడు వాని తొండముల నుండి గంభీరమైన యొక ధ్వని గలుగును. అత్తి పండ్లు పండి ఆవాసనలు వచ్చుచుండును. చల్లఁగా నుండును. ఇట్టి గుణములు గల వాయువులు నీవెంట వచ్చుట నీకు మిగుల ననుకూలము లగును.

త్వదితి.— త్వన్నిష్యన్దేన తవ వృష్ట్యా, ఉచ్ఛ్వసితాయాః ఉపబృంహితాయాః, వసుధాయాః భూమేః, గన్ధస్య, సమ్పర్కేణ, రమ్యః సురభిరిత్యర్థః, స్రోతఃశబ్దేనేన్ద్రియవాచినా తద్విశేషో ఘ్రాణం లక్ష్యతే * 'స్రోతోఽమ్బువేగేన్ద్రియయోః' ఇతి విశ్వః, స్రోతో రన్ధ్రేషు నాసాగ్ర కుహరేషు, యత్, ధ్వనితం శబ్దః, తేన సుభగం యథాతథా, దన్తిభిః గజైః, పీయమానః వసుధాగన్ధలోభా దాఘ్రాయమాణ ఇత్యర్థః, అనేన మాన్ద్య ముచ్యతే, కాననేషు వనేషు, ఉదుమ్బరాణాం జన్తుఫలానాం * 'ఉదమ్బరో జన్తుఫలో యజ్ఞాఙ్గో హేమదుగ్ధకః' ఇత్యమరః, పరిణమయితా పరిపాచయితా * 'మితాం హ్రస్వః' ఇతి హ్రస్వః, శీతో వాతః, దేవ పూర్వం గిరిం దేవగిరి మిత్యర్థః, ఉపజిగమిషోః ఉపగన్తు మిచ్ఛోః, * గమేః సన్నన్తా దుప్రత్యయః, తే తవ, నీచైః శనైః, వాస్యతి త్వాం వీజయిష్యతీత్యర్థః*సంబన్ధమాత్రవివక్షాయాం షష్ఠీ. 'దేవపూర్వం గిరిం' ఇత్యత్ర దేవశబ్ద పూర్వత్వం గిరిశబ్దస్యైవ, నతు సంజ్ఞినస్తదర్థస్యేతి, సంజ్ఞాయాః

సంజ్ఞిత్వాభావా దవాచ్యవచనం దోషమాహు రాలంకారికాః, తదుక్తమే కావల్యామ్* 'యదవాచ్యస్య వచన మవాచ్యవచనం హి తత్' ఇతి. సమాధానం తు దేవశబ్దవిశేషితేన గిరిశబ్దేన శబ్దపరేణార్థో మేఘోపగమన యోగ్యో దేవగిరి ర్లక్ష్యత ఇతి కథంచి త్సంపాద్యమ్.

తత్ర స్కన్దం నియతవసతిం పుష్పమేఘీకృతాత్మా
పుష్పాసారైః స్నపయతు భవా న్వ్యోమగఙ్గాజలార్ద్రైః,
రక్షాహేతో ర్నవశశిభృతా వాసవీనాం చమూనా
మత్యాదిత్యం హుతవహముఖే సంభృతం తద్ధి తేజః. 47

టీ. తత్ర=ఆ దేవగిరియందు, నియత వసతిం=నిత్య నివాసము గల, స్కందం = కుమారస్వామిని, పుష్ప మేఘీకృతాత్మా = పూల వర్షించెడు మేఘముగాఁ జేయఁబడిన దేహము గలవాఁడవై (అనఁగా నీదేహమును పువ్వులవర్షించు మేఘముగాఁ జేసినవాఁడవై), వ్యోమగఙ్గా జలార్ద్రైః; వ్యోమగఙ్గా = ఆకాశగంగ యందలి, జల=ఉదకములచే, ఆర్ద్రైః = తడిసిన, పుష్పా సారైః=పువ్వుల ధారావర్షముచేత, భవాన్ = నీవు, స్నపయతు = అభిషేకముఁ జేయుము. తత్ = అది, (కుమారస్వామి) వాసవీనాం = ఇంద్రుని సంబంధములైన, చమూనాం = సైన్యముల (యొక్క)ను, రక్షా హేతోః=రక్షించుట యను కారణమును బట్టి. నవ శశిభృతా=బాలచంద్ర శేఖరుని చేత, హుతవహ ముఖే = అగ్నిముఖమునందు, సంభృతం = సంపా దింపఁ బడినట్టి, అత్యాదిత్యం = సూర్యునతిక్రమించిన, తేజోహి = తేజస్సు గదా!

తా. ఆ దేవగిరియం దొక్క విశేషము గలదు. పూర్వ మింద్రుని సేనలను రక్షించుటకుఁ గాను శివుఁడు తనతేజము నగ్నియం దుంచినాఁడు. ఆ యగ్ని గంగయం దుంచినాఁడు. ఆ గంగానదియొడ్డున నా దివ్యతేజము కుమారస్వామిగా నవత

రించెను. ఆదేవుఁడు తారకా ద్యసురులఁ బరిమార్చి దేవ ప్రార్థనచే నా దేవగిరియందు నిత్యనివాస మంగీకరించెను. ఆఁ మహానీయుని మీఁద నీవు ఆకాశగంగా జలంబులచేఁ దడుపఁ బడిన చల్లని పుష్పములను వర్షించి కృతార్థుఁడ వగుము.

తత్రేతి.—తత్ర దేవగిరౌ నియతా వసతి ర్యస్య తం నిత్యసన్నిహిత మిత్యర్థః, పురాకిల తారకాఖ్యాసురవిజయసంతుష్ట సురప్రార్థనా వశా ద్భక్తార్తిభఞ్జనో భగవా న్భవానీనన్దనః స్కన్దో నిత్యమహ మిహ సహ శివాభ్యాం వసా మీ త్యుక్త్వా తత్ర వసతీతి ప్రసిద్ధిః. స్కన్దం కుమార స్వామినం, పుష్పాణాం మేఘః పుష్పమేఘః, పుష్పమేఘీకృతాత్మా కామరూప త్వా త్పుష్పవర్షక మేఘీకృతవిగ్రహః సన్, వ్యోమగఙ్గా జలార్ద్రైః, పుష్పా సారైః పుష్పసంపాతైః *'ధారాసంపాత ఆసారః' ఇత్యమరః, భవాన్ స్వయ మేవ, స్నపయతు అభిషిఞ్చతు, స్వయం పూజాయా ఉత్తమత్వా దితి భావః తథాచ శమ్భురహస్యే * 'స్వయం యజతి చేద్దేవ ముత్తమా సోదరాత్మజైః, మధ్యమా యాజయే ద్భృత్యైరధమా యజనక్రియా' ఇతి స్కన్దస్య పూజ్యత్వ సమర్థక మర్థాన్తరం న్యస్యతి-రక్షేతి. తత్ భగవాన్ స్కన్ద ఇత్యర్థః * విధేయ ప్రాధాన్యా న్నపుంసకత్వనిర్దేశః, వాసవస్యేమా వాసవ్యః *'తస్యేదం' ఇత్యణ్, తాసాం, వాసవీనాం ఐన్ద్రీణాం, చమూనాం సేనానాం. రక్షైవ హేతుః తస్య రక్షాహేతోః రక్షయా కారణేన, రక్షార్థ మిత్యర్థః * 'షష్ఠీ హేతుప్రయోగే' ఇతిషష్ఠీ, నవశశిభృతా భగవతా చన్ద్రశేఖరేణ*వహతీతివహః, పచాద్యచ్, హుతస్య వహో, హుతవహః వహ్నిః, తస్య, ముఖే, సంభృతం సంచితం, ఆదిత్య మతిక్రాన్త మత్యాదిత్యమ్ *'అత్యాదయః క్రాన్తాద్యర్థే ద్వితీయయా', ఇతిసమాసః, తేజోహి. సాక్షాద్భగవతో హరస్యైవేదం మూర్త్యన్తరమిత్యర్థః, అతః పూజ్య మితి భావః; ముఖగ్రహణం తు శుచిత్వసూచనార్థం, తదుక్తం

శమ్భురహస్యే * 'గవాం పశ్చాద్ద్విజస్యాక్ష్ణో)ం యోగినాం హృత్కువే ర్వచః, పరం శుచితమం విద్యాన్ముఖం స్త్రీవహ్నివాజినామ్' ఇతి.

జ్యోతిర్లేఖావలయి గళితం యస్య బర్హం భవానీ
పుత్రప్రేమ్ణా కువలయదళప్రాపి కర్ణే కరోతి,
ధౌతాపాఙ్గం హరశశిరుచా పావకే స్తం మయూరం
పశ్చాదద్రిగ్రహణగురుభిర్గర్జితైర్నర్తయేథాః. 48

టీ. జ్యోతి ర్లేఖా వలయి; జ్యోతిః = కాంతులయొక్క, లేఖా = పంక్తుల యొక్క. వలయి=మండలము గలదియు, గళితం = (తనంతట) జారినదియు నగు, యస్య = ఏ మయూరముయొక్క, బర్హం = పింఛమును, భవానీ=పార్వతీ దేవి. పుత్ర ప్రేమ్ణా = కుమారుని యందలి ప్రేమ చేత, కువలయ దళ ప్రాపి = కలువరేకును బొందించు నట్టి (అనఁగా కలువఱే కలంకరించు కొనునట్టి), కర్ణే = చెవియందు (కొనయం దనుట), కరోతి = (నిలుచునట్లు) చేయుచున్నదో, హర శశి రుచా; హర = శివునియొక్క, శశి=చంద్రునియొక్క, రుచా = కాంతిచే, ధౌతా పాఙ్గం; ధౌత = శుభ్రమగు, అపాఙ్గం = కనుఁగొనలు గల, పావకేః = కుమారస్వామియొక్క, తం మయూరం = ఆనెమిలిని, పశ్చాత్=(పుష్పవర్షము కురిసిన) తరువాత, అద్రి గ్రహణ గురుభిః; అద్రి = కొండయొక్క, గ్రహణ = పట్టుకొనుట చేత, గురుభిః=గొప్పవి యగు (అనఁగా కొండగుహాలలోఁ బ్రతిధ్వనించుట చేత, ఉఱుములు గొప్పవిగాఁ దెలియును), గర్జితైః = ఉఱుములచేత, నర్తయేథాః=ఆడింపుమా.

తా. ఆ కుమారస్వామికి నెమిలి కలదు. కుమారుని యందలి ప్రేమచే నాతని వాహనమగు నెమిలిపింఛము నుమ కలువకు మారుగా కర్ణాగ్రమున ధరించుచున్నది. నెమిలి క్రేగండ్లు స్వభావముచేఁ దెల్లని వైనను బాలచంద్ర మౌళీశ్వరుని వెన్నెలచే మఱింత శుభ్రముగా నున్నవి. ఇట్టి చక్కని నెమిలి కొండల

యందు ప్రతిధ్వనించు నట్లు పెద్దగా నీవు నుఱిమిన నాట్యము నందు కడు సంతసముసతో నాట్య మొనరించును. తద్ద్వారా స్వామికి నీయం దనుగ్రహము కలుగునని భావము.

జ్యోతిరితి.—జ్యోతిషః తేజసః లేఖాః రాజయః, తాసాం వలయం, మణ్డలం, యస్యాస్తీతి తథోక్తం, గళితం భ్రష్టం, నతు లౌల్యాత్స్వయం ఛిన్న మితి భావః, యస్య మయూరస్య, బర్హం పింఛం, 'పింఛబర్హే నపుంసకే' ఇత్యమరః. భవానీ గౌరీ, పుత్రప్రేమ్ణా పుత్రస్నేహేన, కువలయస్య. దళం పత్రం, తత్ప్రాపి తద్యోగి యథా తథా, కర్ణే కరోతి, దళేన ధారయతీత్యర్థః,[యద్వా, కువలయస్య, దళప్రాపి దళభాజి, దళార్హే, కర్ణే కరోతి *క్విబన్తాత్సప్తమీ, దళం వ్యావృత్య తత్స్థానే బర్హం ధత్తే ఇత్యర్థః. నాథస్తు 'కువలయదళక్షేపి' ఇతి పాఠమనుసృత్య 'క్షేపో నిన్దాపసారణం వా' ఇతి వ్యాఖ్యాతవాన్], హరశశిరుచా హర శిరశ్చన్ద్రికయా, ధౌతాపాఙ్గం స్వతోఽపి శౌక్ల్యా దతిధవళితనేత్రాన్తం 'అపాఙ్గౌ నేత్రయోరన్తౌ' ఇత్యమరః. పావకస్య అగ్నేః, అపత్యం, పావకిః స్కన్దః * 'అత ఇఞ్', ఇతి ఇఞ్ తస్య, తం పూర్వోక్తం, మయూరం పశ్చాత్ పుష్పాభిషేచనానన్తరం, అద్రేః దేవగిరేః కర్తుః, గ్రహణేన గుహాసఙ్క్రమణేన, గురుభిః ప్రతిధ్వానమహద్భిరిత్యర్థః. గర్జితైః,నర్తయేథాః నృత్యం కారయ, మార్దఙ్గికభావేన భగవన్తం కుమార ముపాస్స్వేతి భావః. 'నర్తయేథాః' ఇత్యత్ర * 'అణావకర్మకాచ్చిత్తవత్కర్తృకాత్' ఇత్యాత్మనే పదాపవాదః * 'నిగరణ చలనార్థేభ్యశ్చ' ఇతి పరస్మైపదం వా న భవతి, తస్య * 'న పాదమ్యాఙ్యమాఙ్యసపరిముహ రుచి నృతి వద వసః' ఇతి ప్రతిషేధాత్.

ఆరాధ్యైనం శరవణభవం దేవముల్లఙ్ఘితాధ్వా
సిద్ధద్వన్ద్వై ర్జలకణభయాద్వీణిభి ర్ముక్తమార్గః,
వ్యాలమ్బేథాః సురభితనయాలమ్భజాం మానయిష్యన్
స్రోతోమూర్త్యా భువి పరిణతాం రన్తిదేవస్య కీర్తిమ్. 49

టీ. శరవణ భవం = రెల్లుగంట యందుఁ బుట్టిన, ఏనం దేవం=ఈ సుబ్రహ్మణ్యేశ్వరుని, ఆరాధ్య=ఆరాధించి, వీణిభిః=వీణలను వాయించుచున్న, సిద్ధద్వంద్వైః=సిద్ధిమిథునములచేత, జలకణ భయాత్ = ఉదకబిందువులు పడు నను భయము వలన, ముక్తమార్గః = ఈయఁబడిన మార్గముగలవాఁడవై, ఉల్లఙ్ఘితాధ్వా; ఉల్లఙ్ఘిత=దాఁటఁబడిన, అధ్వా = మార్గముగలవాఁడవై, సురభి తనయా లమ్భజాం; సురభి తనయ = గోవులయొక్క, ఆలమ్భ=వధ వలన, జాం = పుట్టినదై, భువి = భూమి యందు, స్రోతోమూర్త్యా=నదీ స్వరూపము చేత, పరిణతాం=మారు రూపముఁ బొందిన, రన్తిదేవస్య=రంతి దేవుని యొక్క, కీర్తిం = యశంబును (అనఁగా చర్మణ్వతీనదిని), మాన యిష్యన్=సత్కరింపఁ గలవాఁడవై, వ్యాలంబేథాః = వంగిదిగుము, (లేక నిలువుము.)

తా. ఆకుమారస్వామి నారాధించి యనంతరము వారి వద్ద వీణల వాయించు సిద్ధమిథునములు తమ మీఁద చినుకులు పడకుండునట్లు నీకు మార్గమును వదలి తొలఁగుదురు గాన అంత నీ వచటనుండి పోవునపుడు ఒక నది గన్పడును. ఆనది పూర్వము గవాలంభనము జేసిన రంతిదేవుని యజ్ఞగోవుల సంబంధమగు చర్మముల రక్తము ప్రవహించి నది యయ్యెను. ఇప్పుడు దానిని మనవారు చర్మణ్వతీనది యందురు. అంతటి గవాలంభ మహాయాగ మాయన జేసినందుల కాయనకీర్తికిఁ దార్కాణగా నీనది యుత్పన్నమయినది. నీ వానదికి నమ్రుఁడవై సత్కారముఁ జేయవలయును.

ఆరాధ్యేతి —ఏనం పూర్వోక్తం, శరాః బాణతృణాని 'శరో బాణ తృణే బాణే' ఇతిశబ్దార్ణవే. తేషాం వనం శరవణం* 'ప్రనిరన్తః శర' ఇత్యా దినా ణత్వం. తత్ర భవో జన్మ యస్య తం, శరవణభవం దేవం స్కన్దం 'శర జన్మా షడాననః' ఇత్యమరః. * 'అపర్జ్యోబహువ్రీహి ర్వ్యధికరణో జన్మా

ద్యుత్తరపదః' ఇతి వామనః. అవర్జ్యోఽగతికత్వాదాశ్రయణీయ ఇత్యర్థః. ఆరాధ్య ఉపాస్య. వీణిభిః వీణావద్భిః * వ్రీహ్యాదిత్వా దినిః; సిద్ధద్వన్ద్వైః సిద్ధమిథునైః భగవన్తం స్కన్ద ముపవీణయతు మాగతైరితి భావః, జలకణ భయాత్, జలసేకస్య వీణాక్వణన ప్రతిబన్ధకత్వా దితి భావః. ముక్తమార్గః త్యక్త వర్త్మా సన్, ఉల్లఙ్ఘితాధ్వా కియన్త మధ్వానం గతః ఇత్యర్థః. సురభి తనయానాం గవాం, ఆలమ్భేన సంజ్ఞపనేన, జాతాం తథోక్తాం, భువి లోకే, స్రోతో మూర్త్యా ప్రవాహ రూపేణ, పరిణతాం రూపవిశేషమాపన్నాం, రన్తిదేవస్య దశపురపతేర్మహారాజస్య, కీర్తిం చర్మణ్వత్యాఖ్యాం నదీ మిత్యర్థః. మానయిష్యన్, వ్యాలమ్భథాః అలమ్భ్యవతరే రిత్యర్థః. పురా కిల రాజ్ఞో రన్తిదేవస్య గవాలమ్భే ష్వేకత్ర సంభృతా ద్రక్తనిష్యన్దా చ్చర్మరాశేః కాచిన్నదీ సస్యన్దే, సా చర్మణ్వతీత్యాఖ్యాయతఇత్యుపాఖ్యాయతే.

త్వయ్యాదాతుం జలమవనతే శార్ఙ్గిణో వర్ణచౌరే
తస్యాః సిన్ధోః పృథుమపి తనుం దూరభావాత్ప్రవాహం,
ప్రేక్షిష్యన్తే గగనగతయో నూనమావర్జ్య దృష్టీ
రేకం ముక్తాగుణమివ భువః స్థూలమధ్యేన్ద్రనీలమ్. 50

టీ. శార్ఙ్గిణః=శ్రీకృష్ణునియొక్క, వర్ణచౌరే=కాంతి నపహరించిన (అనఁగాఁ గృష్ణుని కాంతి వంటి కాంతి గల), త్వయి = నీవు, జలం=ఉదక మును, ఆదాతుం=తీసి కొనుటకు, అవనతే = వంగినవాఁడ వగుచుండఁగా, పృథు మపి=పెద్ద దైనను, దూరభావాత్ = దూరముగా నుండుటవలన, తనుం=చిన్నదిగానున్న, తస్యాః సిన్ధోః ప్రవాహం = ఆ నదియొక్క ప్రవా హమును, గగన గతయః = ఆకసమునఁ బోవువారు, నూనం = సత్యముగా, దృష్టీః=చూపులను, ఆవర్జ్య=వంచి, స్థూల మధ్యేన్ద్ర నీలం = లావుగల యింద్రనీల రత్నము నడుమఁ గూర్చిన, ఏకం = ఒంటిపేట దైన, భువః =

భూమియొక్క ముక్తాగుణ మివ=ముత్తెముల హారమువలెనే, ప్రేక్షిష్యన్తే= చూడఁగలరు.

తా. నీవు ఆనదియొద్దకుఁ బోయి యుదకమును గ్రహించుటకు వంగి యుండఁగాఁ బైన నంతరిక్షమునఁ బోవువారు చూచి యా నదిని ముత్యాలహారమును గాను, నిన్ను ఆ ముత్యాలహారము నడుమఁ గూర్చిన యింద్రనీల మణినిగాను ఎంచెదరు.

త్వయీతి.—శార్ఙ్గిణః కృష్ణస్య, వర్ణస్య (కాన్తేః) చౌరే వర్ణచౌరే, తత్తుల్యవర్ణ ఇత్యర్థః. త్వయి జల మాదాతు మవనతే సతి పృథు మపి, దూరభావాత్ దూరత్వాత్, తనుం సూక్ష్మతయా ప్రతీయమానం, తస్యాః సిన్ధోః చర్మణ్వత్యాఖ్యాయాః, ప్రవాహం, గగనే గతి ర్యేషాం తే, గగనగతయః ఖేచరాః, సిద్ధగన్ధర్వాదయః. * అయమపి బహువ్రీహిః పూర్వవ జ్జఙ్ఘాద్యుత్తరపదేషు ద్రష్టవ్యః, నూనం సత్యం. దృష్టీః, ఆవర్జ్య ఆనమ్య, ఏకం ఏక యష్టికం, స్థూలః మహాన్, మధ్యః మధ్యమణీభూతః, ఇన్ద్రనీలో యస్య తం, భువో భూమేః, ముక్తాగుణం ముక్తాహారం, ఇవ, ప్రేక్షిష్యన్తే. అత్రాత్యన్త నీలమేఘసఙ్గతస్య ప్రవాహస్య భూకణ్ఠముక్తాగుణత్వే నోత్ప్రేక్షణా దుత్ప్రేక్షైవేయ మి తీవశబ్దేన వ్యజ్యతే; నిరుక్తకారస్తు * 'తత్ర తత్రోపమా యత్ర ఇవ శబ్దస్య దర్శనం' ఇతీవశబ్దదర్శనా దత్రా ప్యుపమైవేతి బభ్రామ.

తాముత్తీర్య వ్రజ పరిచితభ్రూలతావిభ్రమాణాం
పక్ష్మోత్క్షేపాదుపరివిలసత్కృష్ణశారప్రభాణాం,
కున్దక్షేపానుగమధుకరశ్రీముషామాత్మబిమ్బం
పాత్రీకుర్వ న్దశపురవధూనేత్రకౌతూహలానామ్. 51

టీ. తాం = ఆచర్మణ్వతీనదిని, ఉత్తీర్య = దాఁటి, పరిచిత భ్రూలతా విభ్రమాణాం; పరిచిత = వాడుకపడిన, భ్రూలతా = తీఁగలవంటి కనుబొమల యొక్క; విభ్రమాణాం = విలాసములు కలవియు, పక్ష్మోత్క్షేపాత్, పక్ష్మ =

ఱెప్పలయొక్క, ఉత్క్షేపాత్=ఎత్తుటవలన, ఉపరి విలసత్కృష్ణ శారప్రభాణాం; ఉపరివిలసత్=పైకట్టుప్రకాశించుచున్న, కృష్ణశారప్రభాణాం=కొంచెము ధవళ కాంతితోఁగూడిన నల్లనికాంతులుగలవియు, గనుకనే, కున్ద క్షేపానుగ మధు కరశ్రీ ముషాం; కున్ద=మొల్లపూలను, క్షేప=త్రోయుటను, అనుగ=అనుసరించు నట్టి, మధుకర=తుమ్మెదలయొక్క, శ్రీ ముషాం = కాంతి నపహరించునవియు నగు, (అనఁగా కొంచెము ధవళకాంతితోఁగూడిన నీలకాంతులు కదలుచున్న మొల్లపూవులవెంటఁ గదలు తుమ్మెదలను బోలియున్నవని యర్థము.) దశపుర వధూనేత్ర కౌతూహలానాం; దశపురవధూ = రంతిదేవపురమందలి స్త్రీల యొక్క, నేత్రకౌతూహలానాం = (నిన్నుఁ జూడవలయునను) నేత్రముల యభిలాషములకు, ఆత్మబిమ్బం=నీదేహమును, పాత్రీకుర్వన్=విషయమునుగాఁ జేయుచున్నవాఁడవై (అనఁగా దశపురయువతులు అభిలాషతో నిన్నుఁ జూచు నట్లుగా), వ్రజ=వెళ్లుమా.

తా. నీవు ఆ చర్మణ్వతీ నదిని దాఁటి పోవుచుండఁగా దశపురస్త్రీలు అభిలాషతోఁ జూతురు. ఇట్లు నిన్నుఁ జూచుట వారికి వేడుక యగును. వారి భ్రూవిలాసములను వారి నయన కాంతులనుఁ జూడ నీకు వేడుక యగును.

తామితి.—తాం చర్మణ్వతీం, ఉత్తీర్య, భ్రువో లతా ఇవ భ్రూలతాః * ఉపమితసమాసః. తాసాం విభ్రమాః విలాసాః, పరిచితాః క్లృప్తాః యేషు తేషాం, పక్ష్మాణి నేత్రలోమాని * 'పక్ష్మ సూత్రాది సూక్ష్మాంశే కిఞ్జల్కే నేత్రలోమని' ఇతి విశ్వః, తేషాం, ఉత్క్షేపాత్ ఉన్నమనాద్ధేతోః, కృష్ణాశ్చ తాః శారాశ్చ, కృష్ణశారాః నీలశబలాః *'వర్ణో వర్ణేన' ఇతి సమాసః *'కృష్ణ రక్తసితాః శారాః' ఇతి యాదవః. తత శ్చ శారశబ్దాదేవ సిద్ధే కార్ష్ణ్యే పునః కృష్ణపదోపాదానం కార్ష్ణ్యప్రాధాన్యార్థం, రక్తత్వం తు న వివక్షిత ముపమా నానుసారాత్, తస్య స్వాభావికస్య స్త్రీ నేత్రేషు సాముద్రికవిరోధాదితరస్యా ప్రసఙ్గాత్, క్వచిత్సద్భావకథనంతూపపత్తివిషయం, ఉపరి విలసన్త్యః కృష్ణ

శారాః. ప్రభా యేషాం తేషాం, కున్దాని మాఘ్యకుసుమాని *'మాఘ్యం కున్దం' ఇత్యమరః, తేషాం, ఛేదః, ఇతస్తతశ్చాలనం, తస్య, అనుగాః అనుసారిణో, యే మధుకరాస్తేషాం, శ్రియం ముష్ణన్తీతి తథోక్తానాం, క్షిప్యమాణకున్దానుధావి మధుకర కల్పానా మిత్యర్థః, దశపురం రన్తిదేవస్య నగరం తత్ర, వధ్వః స్త్రియః * 'వధూర్జాయాస్నుషా స్త్రీచ' ఇత్యమరః. తాసాం, నేత్రకౌతూహలానాం నేత్రాభిలాషాణాం, సాభిలాషదృష్టీనా మిత్యర్థః, ఆత్మబిమ్బం స్వమూర్తిం, పాత్రీకుర్వన్ విషయీకుర్వన్, వ్రజ గచ్ఛ.

బ్రహ్మావర్తం జనపదమథ చ్ఛాయయా గాహమానః
క్షేత్రం క్షత్రప్రధనపిశునం కౌరవం తద్భజేథాః,
రాజన్యానాం శితశరశతైర్యత్ర గాణ్డీవధన్వా
ధారాపాతైస్త్వమివ కమలాన్యభ్యవర్షన్ముఖాని. 52

టీ. అథ=పిమ్మట, బ్రహ్మావర్తం=బ్రహ్మావర్తమనెడు, జనపదం=దేశమును, ఛాయయా=నీడచే, గాహమానః = ప్రవేశించుచున్నవాఁడవై, క్షత్ర ప్రధనపిశునం; క్షత్ర=క్షత్రియులయొక్క, ప్రధన=యుద్ధమునకు, పిశునం=సూచకమయిన (అనఁగా శిరఃకపాలాదులు పడియుంటచే నిచ్చటనే కురుపాండవుల యుద్ధము జరిగినదని తెలియునట్టి), తత్ = లోకమందుఁ బ్రసిద్ధమగు, కౌరవం క్షేత్రం=కురుక్షేత్రమును, భజేథాః = పొందుము, యత్ర=ఏకురుక్షేత్రమునందు, గాణ్డీవధన్వా=అర్జునుఁడు, శితశరశతైః = వందలకొలఁది వాఁడియమ్ముల చేత, రాజన్యానాం=రాజులయొక్క, ముఖాని=ముఖములను, ధారాపాతైః= జడివానలచేత, కమలాని=పద్మములను, త్వమివ=నీవలె, అభ్యవర్షత్=వర్షించెను.

తా. పిమ్మట బ్రహ్మావర్తము మీఁదుగాఁ బోయి కురుక్షేత్రమును జేరుము. అది జగత్ప్రసిద్ధమైనది. ఇప్పటికిని యచ్చట నున్న శిరఃకపాలాదులచే గురుతింపఁ దగియున్నది. మున్ను నరుఁ డనేక రాజుల తలలను తన వాఁడి తూపులచే ఛేదించి

జయమును బొంది యున్నాఁడు. గాన అద్భుతమును బవిత్రము నగు నాక్షేత్రము దర్శనీయము.

బ్రహ్మావర్తమితి.—అథ అనన్తరం, బ్రహ్మావర్తం నామ, జనపదం దేశం అత్ర మనుః * 'సరస్వతీ దృషద్వత్యో ర్దేవనద్యో ర్యదన్తరం, తం దేవనిర్మితం దేశం బ్రహ్మావర్తం ప్రచక్షతే' ఇతి, ఛాయయా అనాతపమణ్డలేన, గాహమానః ప్రవిశన్, నతు స్వరూపేణ* 'దేవక్షేత్రాశ్రమాదీని పరిహృత్యాన్యతో వ్రజేత్' ఇతివచనాత్ తత్ర ప్రథనపిశునం అద్యాపి శిరః కపాలాదిమత్తయా కురుపాణ్డవయుద్ధ సూచక మిత్యర్థః. * 'యుద్ధమాయోధనం జన్యం ప్రధనం ప్రవిదారణం' ఇత్యమరః. * తత్ ప్రసిద్ధం, కురూణా మిదం కౌరవం క్షేత్రం భజేథాః కురుక్షేత్రం వ్రజేత్యర్థః. యత్ర కురుక్షేత్రే, గాణ్డీవ మస్యాస్తీతి గాణ్డీవం ధనుర్విశేషః * 'గాణ్డ్యజగాత్సంజ్ఞాయాం' ఇతి మత్వర్థీయో వ ప్రత్యయః 'కపిధ్వజస్య గాణ్డీవ గాణ్డివౌ పున్నపుంసకౌ' ఇత్యమరః, తద్ధనుర్యస్య సః గాణ్డీవధన్వా అర్జునః. 'వా సంజ్ఞాయాం' ఇత్యనఙాదేశః. శితశరశతైః నిశితబాణసహస్రైః, రాజన్యానాం రాజ్ఞాం, ముఖాని, ధారాణాం ఉదక ధారాణాం, పాతైః, కమలాని త్వమివ, అభ్యవర్షత్ అభిముఖం వృష్టవాన్, శరవర్షేణ శిరాంసి చిచ్ఛేదేత్యర్థః.

హిత్వా హాలామభిమతరసాం రేవతీలోచనాఙ్కాం
బన్ధుప్రీత్యా సమరవిముఖో లాఙ్గలీ యాః సిషేవే,
కృత్వా తాసామభిగమమపాం సౌమ్య సారస్వతీనా
మన్తశ్శుద్ధ స్త్వమసి భవితా వర్ణమాత్రేణ కృష్ణః. 53

టీ. బన్ధుప్రీత్యా = బాంధవులయందలి ప్రేమచే, సమర విముఖః = యుద్ధమునం దిచ్ఛలేని, లాఙ్గలీ = బలరాముఁడు. అభిమతరసాం; అభిమత = మిక్కిలి యిష్టమగు, రసాం = రుచిగలదై, రేవతీ లోచ నాఙ్కాం; రేవతీ = రేవతీదేవియొక్క. లోచన = కన్నులే, అఙ్కాం =

చిహ్నముగాఁ గల (తన కత్యంత మిష్టమైన సురయందు తనప్రేయసి ప్రతి బింబము కనఁబడుటచే వర్జనీయ మైన దనుట), హాలాం = సురను, హిత్వా = విడిచి, యాః = ఏ (సరస్వతీ నది యొక్క) ఉదకములను, సిషేవే = సేవించెనో, సౌమ్య = మంచివాఁడా, త్వం = నీవు. తాసాం సారస్వతీనాం అపాం=ఆ సరస్వతీనదీ యుదకములయొక్క, అభిగమం = సేవను, కృత్వా = చేసి, అన్తః=లోపల, శుద్ధః = పరిశుద్ధుండవు, అసి = అగుచున్నావు, వర్ణమాత్రేణ=వర్ణముచేతనే, కృష్ణః=నల్లనివాఁడవు, భవితా౽సి=అగుచున్నావు.

తా. ఆ కురుక్షేత్ర ప్రాంతమున సరస్వతీ నది యున్నది. ఆనదిని సేవించితివేని నీ యాకృతి నైల్య మన్ను యున్నను నీయంతరాత్మ పరిశుద్ధ మగుచున్నది.

హిత్వేతి. బన్ధుప్రీత్యా కురుపాణ్డవస్నేహేన, న తు భయేన, సమర విముఖో యుద్ధ నిఃస్పృహః; లాఙ్గల మస్యా స్తీతి, లాఙ్గలీ హాలధరః, అభిమతరసాం అభీష్టస్వాదాం, తథా, రేవత్యాః స్వప్రియాయాః, లోచనే ఏవాఙ్కః, ప్రతిబిమ్బితచిహ్నం, యస్యాస్తాం హాలాం సురాం * 'సురాహాలి ప్రియా హాలా' ఇత్యమరః. * అతిప్రయుక్తం దేశభాషాపద' మిత్యత్రసూత్రే హాలేతి దేశభాషాపద మప్యతీవ కవిప్రయోగా త్సాధ్వి త్యుదాజహార వామనః. హిత్వా త్యక్త్వా, దుస్త్యజా మపీతి భావః, యాః సారస్వతీ రసః, సిషేవే, హేసౌమ్య సుభగ; త్వం తాసాం సరస్వత్యాః నద్యా ఇమాః సారస్వత్య స్తాసాం అభిగమం సేవాం, కృత్వా, అన్తః అన్తరా

(పూర్వకథ తాత్పర్యము కాదు.)

*పూర్వము బలరాముఁడు కురు పాండవ యుద్ధమునందు ఉభయులును తనకు ముఖ్య బంధువులేగాక నెవరి తట్టునను బోవుట కిష్టము లేనివాఁడయి తీర్థయాత్ర కేగెను. అప్పుడు తన కతిప్రియమైన రేవతీ సురలను విడిచి పరమపావన మగుసరస్వతీ జలమ్ములఁ గ్రోలి పరిశుద్ధుఁ డాయె ననుకథ యనుసంధానముఁ జేసికొనవలయును.

త్మని, శుద్ధో నిర్మలో, నిర్దోషో, భవితా 'ఋవ్యట్లృచా' ఇతితృచ్, అసి సద్య ఏవ పూతో భవిష్యసీ త్యర్థః. 'వర్తమానసామీప్యే వర్తమానవ ద్వా' ఇతి వర్తమాన ప్రత్యయః. వర్ణమాత్రేణ వర్ణేనైవ, కృష్ణః శ్యామః, న తు పాపే నేత్యర్థః, అన్తఃశుద్ధి రేవ సంపాద్యా న తు బాహ్యే. బహిఃశుద్ధోఽపి సూతవధ ప్రాయశ్చిత్తార్థం సారస్వత సలిలసేవీ తత్రభవా న్బలభద్ర ఏవ నిదర్శనం, అతో భవతాపి సరస్వతీ సర్వథా సేవితవ్యేతి భావః.

తస్మాద్గచ్ఛేరనుకనఖలం శైలరాజావతీర్ణాం
జహ్నోః కన్యాం సగరతనయస్వర్గసోపానపఙ్క్తిం,
గౌరీవక్త్రభ్రుకుటిరచనాం యా విహస్యేవ ఫేనైః
శమ్భోః కేశగ్రహణమకరోదిన్దులగ్నోర్మిహస్తా. 51

టీ. తస్మాత్=ఆకురుక్షేత్రము నుండి, అను కనఖలం = కనఖల పర్వత సమీపమునందు, శైల రాజావతీర్ణాం; శైలరాజ = హిమవంతమునుండి, అవ తీర్ణాం=దిగినదై. సగర తనయ స్వర్గ సోపాన పఙ్క్తిం; సగరతనయ = సగర చక్రవర్తి పుత్రులకు, స్వర్గసోపాన పఙ్క్తిం = స్వర్గమునకుఁబోవుటకు ఏర్ప డిన మెట్లవరుసగానుండిన (అనఁగా గంగానది వలన సగరుని పుత్రులకు స్వర్గము గలిగినదని భావము), జహ్నోః కన్యాం=జహ్ను మహర్షికిఁ గూతు రగు గంగానదిని, గచ్ఛేః = సేవింపుము, యా = ఏజాహ్నవి, గౌరీ వక్త్ర భ్రుకుటి రచనాం; గౌరీ = పార్వతీ దేవీ యొక్క, భ్రుకుటి = బొమముడి యొక్క, రచనాం=కార్యమును, ఫేనైః=నురగలచే, విహస్యేవ=ఎగతాళిఁజేసి నట్లు, ఇన్దులగ్నోర్మి హస్తా; ఇన్దు = చంద్రునియందు, లగ్న = కలిసి కొనిన, ఊర్మిహస్తా=తరంగములను హస్తములు గలదై, శమ్భోః=ఈశ్వరునియొక్క, కేశగ్రహణం=కేశములను బట్టుకొనుటను, అకరోత్=చేసెను.

తా. ఆ కురుక్షేత్రము నుండి పోవఁగా కనఖలమను పర్వతము కనఁబడును. గంగానది హిమవంతము నుండి దాని

యొద్ద దిగినది. అచ్చటి నుండి జహ్నుని యజ్ఞవాటము నుండి ప్రవహింపఁ బోఁగా నా రాజా ప్రవాహము నంతయు తన గర్భమునం జేర్చికొని కర్ణ వివరమునుండి విడిచి తనకుం గుమారితగా భావించెను. అంత జాహ్నవి కపిల రోషాగ్ని భస్మము లగు సగరుని బిడ్డలపైఁ బ్రవహింప స్వర్గము గలిగెను. శివ జటలయందున్న గంగ సవతిని పరిహాసము చేసినట్లుం డెను. పుట్టుక హిమవంతము ప్రభావము పుణ్యము నిచ్చుట సౌభాగ్యము సవతిని మించి భర్తశిరంబునం దుండుట. ఇట్టి మహనీయ గుణవంతురా లగు గంగ నీకు సేవ్యురాలైన నీకు శ్రేయమ్ము.

తస్మాదితి. తస్మాత్ కురుక్షేత్రాత్, కనఖలస్యాద్రేః సమీపేఽనుకనఖలం 'అనుర్యత్సమయా' ఇత్యవ్యయీభావః, శైలరాజాత్ హిమవతః, అవతీర్ణాం, సగరతనయానాం, స్వర్గసోపానపఙ్క్తిం స్వర్గప్రాప్తిసాధనభూతామిత్యర్థః, జహ్నో ర్నామ రాజ్ఞః కన్యాం జాహ్నవీం, గచ్ఛేః గచ్ఛ విధ్యర్థే లిఙ్, యా జాహ్నవీ, గౌర్యా వక్త్రే యా, భ్రుకుటిరచనా సాపత్న్యరోషాద్భ్రూభఙ్గకరణం, తాం, ఫేనైః. విహస్య హసిత్వేవ, ధావళ్యాత్ఫేనానాం హాసత్వే నో త్ప్రేక్షా, ఇన్దౌ శిరోమాణిక్యభూతే, లగ్నా ఊర్మయ ఏవ హస్తా యస్యాః సేన్దులగ్నోర్మిహస్తా సతీ, శమ్భోః కేశగ్రహణమకరోత్; యథా కాచి త్ప్రౌఢానాయికా సపత్నీ మసహమానా తా మనాదృత్య స్వవాల్లభ్యం ప్రకటయన్తీ స్వభర్తారం సహశిరోరత్నేన కేశే ష్వాకర్షతి తద్వదితి భావః; ఇదం చ పురా కిల భగీరథ ప్రార్థనయా భగవతీం గగనపథా త్పతన్తీం గఙ్గాం గఙ్గాధరో జటాజూటేన జగ్రాహేతి కథా ముపజీవ్యోక్తమ్.

తస్యాః పాతుం సురగజ ఇవ వ్యోమ్ని పశ్చార్ధలమ్బీ
త్వం చేదచ్ఛస్ఫటికవిశదం తర్కయే స్తిర్యగమ్భః,

సంసర్పన్త్యాః సపది భవతః స్రోతసి చ్ఛాయయాఽసౌ
స్యాదస్థానోపగతయమునాసఙ్గమేవాభిరామా. 55

టీ. సుర గజ ఇవ = దేవ గజము వలెను, వ్యోమ్ని=ఆకసమునందు, పశ్చార్ధ లమ్బీ = (వెనుకటి సగముదేహముచే) తలక్రిందుగా వ్రేలాడుచున్న వాఁడవై, అచ్ఛ స్ఫటిక విశదం; అచ్ఛ = స్వచ్ఛమగు, స్ఫటిక = స్ఫటికము వలె, విశదం = శుభ్రమైన: తస్యాః=ఆ గంగానదియొక్క, అమ్భః = ఉదకమును, తిర్యక్ = అడ్డముగా, పాతుం = త్రాగుటకు, తర్కయేశ్చేత్ = ఊహించితి వేని, సపది = అప్పుడు, స్రోతసి = ప్రవాహమునందు, సంసర్పన్త్యా= వ్యాపించుచున్న, భవతః = నీయొక్క, ఛాయయా = నీడచే, అసౌ = ఈ నది, అస్థానోపగత యమునాసఙ్గ మేవ; అస్థాన = చోటుగాని చోట, (అనఁగా ప్రయాగయందే గంగా యమునా సంగమము కుటియొక్కచోటు అస్థాన మని భావము.) ఉపగత = పొందఁబడిన, యమునా=యమునా నదియొక్క, సఙ్గమేవ = కూడిక వలె, అభిరామా = సుందరమైనదిగా, స్యాత్ = అయ్యెను.

తా. నీవు ఆ గంగానది నీరు గ్రోలుటకు వంగి నప్పుడు దేవతాగజమువలె నుందువు నీ నీడ ఆగంగయందు ప్రతిఫలించి ప్రయాగ యందు గాక ఇచ్చటను సైతము యమునానది యగానదితోఁ గూడినదో యనునట్లు చూడ వేడుకఁ గొల్పు చుండును.

తస్యాఇతి.—సురగజఇవ, కశ్చి ద్దిగ్గజఇవ వ్యోమ్ని పశ్చాదర్ధం పశ్చార్థం పశ్చిమార్ధ మిత్యర్థః * పృషోదరాదిత్వా త్సాధుః. తేన లమ్బత ఇతి పశ్చార్ధలమ్బీ సన్, పశ్చార్ధభాగేన వ్యోమ్ని స్థిత్వా పూర్వార్ధేన జలోన్ముఖ ఇత్యర్థః, కేచిత్పూర్వార్ధలమ్బీతి పఠన్తి, అచ్ఛస్ఫటికవిశదం నిర్మల స్ఫటికావదాతమ్, తస్యాః గఙ్గాయాః, అమ్భః తోయం, తిర్యక్ తిరశ్చీనం యథా తథా. పాతుం త్వం తర్కయేః విచారయేశ్చేత్, సపది, స్రోతసి ప్రవాహే, సంసర్పన్త్యా సంక్రామన్త్యా, భవతః, ఛాయయా ప్రతిబిమ్బేన,

అసౌ గఙ్గా, అస్థానే ప్రయాగా దన్యత్ర, ఉపగతః ప్రాప్తః, యమునా సఙ్గమో, యయా సా తథాభూతేవ, అభిరామా స్యాత్.

ఆసీనానాం సురభితశిలం నాభిగన్ధై ర్మృగాణాం
తస్యా ఏవ ప్రభవ మచలం ప్రాప్య గౌరం తుషారైః.
వక్ష్యస్యధ్వశ్రమవినయనే తస్య శృఙ్గే నిషణ్ణః
శోభాం శుభ్ర త్రినయనవృషోత్ఖాతపఙ్కోపమేయామ్. 56.

టీ. ఆసీనానాం = కూర్చొని యున్న, మృగాణాం = కస్తూరిమృగముల యొక్క, నాభిగన్ధైః = బొడ్డులందలి కస్తూరి పరిమళము చేత, సురభితశిలం; సురభిత = పరిమళించుచున్న, శిలం = ఱాలు గలదియు, తస్యా ఏవ=ఆ గంగానదికే, ప్రభవం = కారణ మయినది యు, తుషారైః=మంచులచేత, గౌరం = తెల్లనిదియు నగు, అచలం = హిమవత్పర్వతమును. ప్రాప్య=పొంది, అధ్వశ్రమ వినయనే; అధ్వశ్రమ=మార్గాయాసమును, వినయనే=పోఁగొట్టునట్టి, తస్య = ఆ హిమవత్పర్వతము యొక్క, శృఙ్గే = శిఖరమునందు, నిషణ్ణః= కూరుచున్న వాఁడ వై, శుభ్ర త్రినయన వృషోత్ఖాత పఙ్కోపమేయాం; శుభ్ర = తెల్లని, త్రినయన వృష=శివుని వృషభము చే, ఉత్ఖాత=త్రవ్వఁబడిన, పఙ్క = బురదతో, ఉపమేయాం = పోల్పఁదగిన, శోభాం=కాంతిని, వక్ష్యసి= వహింపఁ గలవు.

తా. ఆ గంగానదికి హిమవంతము దగ్గరనే యుండును ఆ గిరి పాషాణములపై కస్తూరిమృగములు పండుకొనును గనుక పరిమళము గ్రమ్ముచుండును. మిక్కిలి మం చుండుటచే శుభ్రముగఁ గన్పడు చుండును. మఱియు నాకొండ పార్వతీ దేవికి తండ్రి యగుటచే పవిత్రమయినది దాని శిఖరమునందుఁ గూరుచుంటి వేని నీకు మార్గాయాసము దీరును. శుభ్ర మైన

యా పర్వత శిఖరమునందుఁ గూరుచున్న నల్లని వాఁడ వైన నీవు శివుని వృషభము గోరాడఁ గొమ్మున నంటుకొనిన బురద మంటివలెఁ జూడ వేడుకగా నుందువు.

ఆసీనానామితి—ఆసీనానాం ఉపవిష్టానాం, మృగాణాం కస్తూరికామృగాణాం, అన్యథా నాభిగన్ధానుపపత్తేః, నాభిగన్ధైః కస్తూరీగన్ధైః, తేషాం తదుద్భవత్వాత్, అతఏవ మృగనాభిసంజ్ఞా చ * 'మృగనాభిర్మృగమదః కస్తూరీ చ' ఇత్యమరః. అథవా నాభయః కస్తూర్యః *'నాభిః ప్రధానే కస్తూర్యాం మదేచ క్వచిదీరితః' ఇతి విశ్వః. తాసాం గన్ధైః సురభితాః శిలా యస్య తం, తస్యాః (గఙ్గాయాః) ఏవ. ప్రభవస్యాస్తాదితి, ప్రభవః కారణం, తుషారైః, గౌరం సితం* 'అవదాతః సితో గౌరః' ఇత్యమరః. అచలం, ప్రాప్య, వినీయతేఽనేనేతి వినయనమ్ *కరణే ల్యుట్, అధ్వశ్రమస్య, వినయనే అపనోదనే, తస్య హిమాద్రేః, శృఙ్గే నిషణ్ణః సన్; శుభ్రత్రినయనస్య (త్ర్యమ్బకస్య) వృషో (వృషభః) * 'సుకృతే వృషభే వృషః' ఇత్యమరః. తేన, ఉత్ఖాతేన విదారితేన, పఙ్కేన సహ, ఉపమేయామ్. ఉపమాతు మర్హాం, శోభాం, వక్ష్యసి*వహతే ర్లృట్. 'త్రినయన' - ఇత్యత్ర* 'పూర్వపదాత్సంజ్ఞాయామగః' ఇతి ణత్వం న భవతి *క్షుభ్నాదిషు చ' ఇతి నిషేధాత్. తస్యాః ప్రభవ మిత్యాదినా హిమాద్రౌ మేఘస్య వైవాహిక గృహవిహారో ధ్వన్యతే.

తం చేద్వాయౌ సరతి సరళస్కన్ధసంఘట్టజన్మా
బాధేతోల్కాక్షపితచమరీవాలభారో దవాగ్నిః,
అర్హస్యేనం శమయితుమలం వారిధారాసహస్రై
రాపన్నార్తిప్రశమనఫలాః సమ్పదో హ్యుత్తమానామ్. 57

టీ. వాయౌ = వాయువు, సరతి = వీచుచుండఁగా, సరళ స్కన్ధ సంఘట్ట జన్మా; సరళ = దేవదారు వృక్షములయొక్క, స్కన్ధ = బోదెల యొక్క, సంఘట్ట = ఒరపిడి వలన, జన్మా = పుట్టుకగల, ఉల్కా క్షపిత

చమరీ వాల భారః, ఉల్కా = మిణుఁగురులచేత, క్షపిత = కాల్పఁ బడిన, చమరీ = చమరమృగముల, వాల భారః = వెంట్రుకల మొత్తము గల, దవాగ్నిః = కారుచిచ్చు, తం=ఆ హిమవత్పర్వతమును, బాధేత చేత్ = బాధించు నేని, ఏనం = ఈదావాగ్నిని, వారి ధారా సహస్రైః = వేలకొలఁది జలధారల చేత, అలం = మిక్కిలి, శమయితుం = చల్లార్చుటకు, అర్హసి = తగుదువు, ఉత్తమానాం = మహాత్ములయొక్క, సమ్పదః=సంపదలు, ఆపన్నార్తి ప్రశమన ఫలా హి; ఆపన్న = కష్టమునుఁ బొందిన వారియొక్క, ఆర్తి = పీడను, ప్రశమన = తీర్చుటయే, ఫలాహి=ఫలముగాఁ గలవి గదా?

తా. ఆ హిమవంతమున గాలి యొరపిడిచేఁ బుట్టిన దేవదారు వృక్షముల యందలి నిప్పు చమరీ మృగముల తోఁక వెంట్రుకలను గాల్చి కొండకును జాల తాపము కలిగించును. కావున నీవు ధారలుగా వర్షించి దానిని జల్లార్పుము. హిమవంతుఁడు నీకు మిత్రుఁడు గదా? మిత్రున కుపకారము చేయుట సజ్జనుల సంపదకు ఫలము.

తమితి.—వాయౌ వన వాతే, సరతి వాతి సతి, సరళానాం దేవదారు ద్రుమాణాం, స్కన్ధాః ప్రదేశవిశేషాః *'అస్త్రీ ప్రకాణ్డః స్కన్ధ స్స్యాన్మూలా చ్ఛాఖావధే స్తరోః' ఇత్యమరః.—తేషాం, సంఘట్టనేన సంఘర్షణేన, జన్మ యస్య స తథోక్తః *జన్మోత్తరపదత్వా ద్వ్యధికరణోఽపి బహువ్రీహిః సాధు రిత్యుక్తమ్, ఉల్కాభిః స్ఫులిఙ్గైః, క్షపితాః నిర్దగ్ధాః, చమరీణాం వాల భారాః కేశసమూహాః, యేన సః, దవ ఇ త్యగ్ని ర్దవాగ్ని ర్వనవహ్నిః * 'వవే చ వన వహ్నౌచ దవో దావ ఇ తీష్యతే' ఇతి యాదవః. తం హిమాద్రిం, బాధేత చేత్ పీడయేద్యది, ఏనం దవాగ్నిం వారిధారా సహస్రైః, అలం అత్యన్తం, శమయితు మర్హసి; యుక్తం చైత ది త్యాహ—ఉత్తమానాం మహాతా సంపదః సమృద్ధయః, ఆపన్నానాం ఆర్తానాం, ఆర్తిప్రశమనం ఆపన్ని వా

మేవ, ఫలం ప్రయోజనం, యాసాం తా స్తథోక్తా హి, అతో హిమాచలస్య దావానల స్త్వయా శమయితవ్య ఇతిభావః.

యే సంరమ్భోత్పతనరభసాః స్వాఙ్గభఙ్గాయ తస్మిన్
ముక్తాధ్వానం సపది శరభా లఙ్ఘయేయుర్భవ న్తం,
తాన్కుర్వీథా స్తుములకరకావృష్టిపాతావకీర్ణాన్
కే వా న స్యుః పరిభవపదం నిష్ఫలారమ్భయత్నాః. 58

టీ. తస్మిన్ = ఆహిమాద్రియందు, సంరమ్భోత్పతనరభసాః; సంరమ్భ = (నిన్నుఁజూచి యేనుఁగని భ్రమసి చంపవలయు నను) తొందరపాటుచే నైన, ఉత్పతన = యెగురుట యందలి, రభసాః = వేగము గలవి యగు (అనఁగా అతివేగముగా నెగిరిన), యేశరభాః = ఏశరభములను మృగములు, స్వాఙ్గ భఙ్గాయ = తమ యొడలు విరుగుట కొఱకు (అనఁగా నొడలు విరుగునట్లు), ముక్తాధ్వానం=త్రోవను విడచిన, భవన్తం = నిన్ను, సపది = అపుడు, లఙ్ఘయేయుః = దాఁటునో, తాన్ = ఆ శరభములను, తుములకరకా వృష్టి పాతా వకీర్ణాన్; తుముల = అధికమయిన, కరకా=వడగండ్లయొక్క, వృష్టి = వర్షముయొక్క, పాత = పడుటచేత, అవకీర్ణాన్ = వ్రేయఁబడిన వాటినిగా, కుర్వీథాః = చేయుము, నిష్ఫలారమ్భ యత్నాః; నిష్ఫల=ప్రయోజనములేని, ఆరమ్భ = కార్యములయందు, యత్నాః =ప్రయత్నము గలవారు (అనఁగా పనికిమాలిన పనిచేయువారు), కేవా = ఎవ్వరు, పరిభవ పదం=తిరస్కారమునకు స్థానముగా, న స్యుః=కారు.

తా. ఆ కొండమీఁది శరభ మృగములు నిన్నేనుఁగనుభ్రాంతిచే నీమీఁద నతివేగముగా దుముకును. ఆ సమయమందు అవి దుముకఁ జూచిన మార్గమును తటాలునఁ దప్పింపుము. అంతట నవి యొడలు విరుగునటుల క్రిందఁ బడును. ఆపైని నీవు దానిమీఁద వడగండ్లవానను దట్టముగాఁ గురియుము. ఉపయోగము మాలిన పనిచేయువారికి గౌరవము రాదు గదా!

య ఇతి.—తస్మిన్ హిమాద్రౌ, సంరమ్భః సంభ్రమః కోపో వా * 'సంరమ్భః సంభ్రమే కోపే' ఇతి శబ్దార్ణవే, తేన గజ ఇతి భ్రాన్త్యా, ఉత్పతనే ఉత్ప్లవనే. రభసో వేగో, యేషాం తే తథోక్తాః * 'రభసో వేగహర్షయోః' ఇతి విశ్వః. యే శరభాః అష్టాపద మృగవిశేషాః * 'శరభః శలభే చాష్టాపదే ప్రోక్తో మృగాన్తరే' ఇతి విశ్వః, ముక్తః త్యక్తః, అధ్వా శరభోత్ప్లవనమార్గో, యేన తం భవన్తం సపది స్వాఙ్గభఙ్గాయ లఙ్ఘయేయుః *సంభావనాయాం లిఙ్ భవతోఽతిదూరత్వాత్ స్వాఙ్గభఙ్గాతిరిక్తం ఫలం నాస్తి తేషాం లఙ్ఘనస్యేత్యర్థః, తాఞ్ఛరభాన్, తుములాః సంకులాః, కరకాః వర్షోపలాః* 'వర్షోపలస్తు కరకా' ఇత్యమరః, తాసాం వృష్టిస్తస్యాః పాతేన, అవకీర్ణాన్ అవక్షిప్తాన్, కుర్వీథాః కురుష్వ, విధ్యర్థే లిఙ్, క్షుద్రోఽప్యధిక్షిపన్ ప్రతిపక్షః సద్యః ప్రతిక్షేప్తవ్య ఇతిభావః. తథాహ—ఆరభ్యన్త ఇతి, ఆరమ్భాః కర్మాణి, తేషు, యత్నః ఉద్యోగః స నిష్ఫలో యేషాం తే తథోక్తాః నిష్ఫలకర్మోపక్రమా ఇత్యర్థః. అతః కే వా, పరిభవపదం తిరస్కారపదం, న స్యుః న భవన్తి, సర్వ ఏవ భవన్తీత్యర్థః. యదత్ర * 'ఘనోపలస్తు కరక' ఇతి యాదవవచనాత్కరకశబ్దస్య నియతపుంలిఙ్గతాభిప్రాయేణ 'కరకాణా మావృష్టిః' ఇతి కేషాంచిద్వ్యాఖ్యానం తదన్యే నానుమన్యన్తే, 'వర్షోపలస్తు కరకా' ఇత్యమరవచనవ్యాఖ్యానే క్షీరస్వామినా 'కమణ్డలౌ చ కరకః సుగతే చ వినాయక' ఇతి నానార్థే పుంస్యపి వక్ష్యతీతి వదతోభయలిఙ్గతాప్రకాశనాత్, యాదవస్య తు పుల్లిఙ్గతావిధానే తాత్పర్యం న తు స్త్రీలిఙ్గతానిషేధ ఇతి న తద్విరోధోఽపి * 'కరకస్తు కరఙ్కే స్యాద్దాడిమే చ కమణ్డలౌ, పక్షిభేదే కరే చాపి కరకా చ ఘనోపలే' ఇతి విశ్వప్రకాశవచనే తూభయలిఙ్గతా వ్యక్తైవేతి న కుత్రాపి విరోధవార్తా, అత ఏవ రుద్రః 'వర్షోపలస్తు కరకా కరకోఽపి చ దృశ్యతే' ఇతి.

తత్ర వ్యక్తం దృషది చరణన్యాసమర్ధేన్దుమౌళేః
శశ్వత్ సిద్ధైరుపచితబలిం భక్తినమ్రః పరీయాః,

యస్మిన్ దృష్టే కరణవిగమాదూర్ధ్వముద్ధూతపాపాః
కల్పిష్యన్తే స్థిరగణపదప్రాప్తయే శ్రద్దధానాః. 59

టీ. తత్ర = ఆ హిమవన్నగమునందు, దృషది = ఒక రాతిమీఁద, వ్యక్తం=వెల్లడి యయినదియు, శశ్వత్ =పలుమారు, సిద్ధైః=యోగులచే, ఉపచిత బలిం=చేయఁబడిన పూజ గలదియునగు, అర్ధేన్దుమౌళేః=శివునియొక్క, చరణన్యాసం=అడుగును, భక్తినమ్రః=భక్తిచే వంగినవాఁడవై, పరీయాః=వలఁగొనుము, యస్మిన్ =ఏ (అ) పాదన్యాసము, దృష్టే=చూడఁ బడఁగా, ఉద్ధూతపాపాః=ఎగురఁ గొట్టఁ బడిన పాపములుఁగలవారై, శ్రద్దధానాః = తత్సేవ శ్రేయస్సాధనమను) నమ్మకము గలవారై, కరణ విగమా దూర్ధ్వం=శరీరము పోయిన తరువాత, స్థిరగణపదప్రాప్తయే; స్థిర=నాశనములేని, గణపద=ప్రమథగణ స్థానమును, ప్రాప్తయే=పొందుట కొఱకు, కల్పిష్యంతే=సమర్థులు కాఁగలరు.

తా. ఆ హిమవతంబునఁ బూర్వమునఁ సిద్ధులు సిద్ధినొందుట కొక రాతిపై తన పాదము నుంచెను. ఆ పాదన్యాసమును సిద్ధులు పూజించి శివ సాలోక్యము నొందెదరు. అట్టి పాదన్యాసమునకు భక్తితోఁ బ్రదక్షిణముఁ జేయుము. నీవును శ్రేయమ్ము నొందెదవు.

తత్రేతి.—తత్ర హిమాద్రౌ, దృషది కస్యాంచిచ్ఛిలాయాం, వ్యక్తం ప్రకటం శశ్వత్ సదా, సిద్ధైః యోగిభిః * 'సిద్ధి ర్నిష్పత్తియోగయోః' ఇతి విశ్వః, ఉపచిత బలిం రచిత పూజం * 'బలిః పూజోపహారయోః' ఇతి యాదవః, అర్ధశ్చాసా విన్దు శ్చేత్యర్ధేన్దుః;* 'అర్ధః ఖణ్డే సమాంశేఽర్ధం' ఇతివిశ్వః, స మౌలౌ యస్య తస్యేశ్వరస్య, చరణన్యాసం పాదవిన్యాసం భక్తిః పూజ్యేష్వనురాగః, తయా నమ్రః సన్ పరీయాః ప్రదక్షిణం కురు. *పరిపూర్వా దిణో లిఙ్, యస్మిన్ పాదన్యాసే, దృష్టే సతి, ఉద్ధూత

పాపాః నిరస్తకల్మషాః, సన్తః శ్రద్దధానాః విశ్వసన్తః పురుషాః, శ్రద్ధా విశ్వాసః ఆస్తిక్యబుద్ధిరితి యావత్ *'శ్రదన్తరో రుపసర్గవద్వృత్తిర్వక్తవ్యా' ఇతి శ్రత్పూర్వాద్దధాతేః శానచ్; కరణస్య క్షేత్రస్య, విగమాదూర్ధ్వం దేహాత్యాగానన్తరం* 'కరణం సాధకతమ క్షేత్ర గాత్రేన్ద్రియేష్వపి' ఇత్యమరః, స్థిరం శాశ్వతం, గణానాం ప్రమథానాం, పదం స్థానం * 'గణాః ప్రమథ సంఖ్యౌఘాః' ఇతి వైజయన్తీ, తస్య ప్రాప్తయే కల్పిష్యన్తే సమర్థా భవిష్యన్తి *క్లృపేః పర్యాప్తివచనస్యాలమర్థత్వాత్తద్యోగే. 'నమః స్వస్తి' ఇత్యాదినా చతుర్థీ * 'అల మితి పర్యాప్త్యర్థగ్రహణం' ఇతి భాష్యకారః. 'అవ్యక్తో వ్యఞ్జయామాస శివః శ్రీచరణద్వయం, హిమాద్రౌ శామ్భవాదీనాం సిద్ధయే సర్వకర్మణాం, దృష్ట్వా శ్రీచరణన్యాసం సాధకః స్థిరయేత్తనుం, ఇచ్ఛాధీన శరీరో హి విచరేచ్చ జగత్రయం' ఇతి శమ్భురహస్యే.

శబ్దాయన్తే మధురమనిలైః కీచకాః పూర్యమాణాః
సంసక్తాభి స్త్రిపురవిజయో గీయతే కిన్నరీభిః,
నిర్హ్రాద స్తే మురజఇవ చేత్కన్దరేషు ధ్వనిః స్యాత్
సంగీతార్థో నను పశుపతే స్తత్ర భావీ సమగ్రః, 60

టీ. కీచకాః=బొంగువెదుళ్లు, అనిలైః=వాయువులచేత,పూర్యమాణాః=నిండింపఁబడినవై, మధురం=ఇంపుగా, శబ్దాయన్తే=మ్రోగుచున్నవి. సంసక్తాభిః ఒండొరులతోఁ గూడికొనిన, కిన్నరీభిః=కిన్నరస్త్రీలచేత, త్రిపురవిజయః=(శివుఁడు) త్రిపురాసురులను జయించినకథ, గీయతే=పాడఁబడుచున్నది, కన్దరేషు=గుహాలయందు, తే=నీయొక్క. నిర్హ్రాదః ధ్వనిః=ఉఱుముల మ్రోఁత మురజే ఇవ=మద్దెలయందువలె, స్యాచ్చేత్=అయెనేని, తత్ర = అక్కడ, పశుపతేః=శివునియొక్క, సంగీతార్థః=సంగీతమనువస్తువు, సమగ్రః=సంపూర్ణమైనదిగా, భావి నను=కాఁ గలదు గదా?

తా. తుమ్మెదలచే రంధ్రములు చేయఁబడిన బొంగు వెదుళ్లు గాలిచే నింపఁబడి మ్రోఁగుచున్నవి. కిన్నరస్త్రీలు గుం

ఫులు గూడి త్రిపురాసురులను శివుఁడు జయించిన కథనుపాడు చున్నారు. నీవు ఉఱిమి నట్లైన ఆధ్వని కొండ గుహాలలో చేరి వెలువడు నప్పుడు మద్దెలమ్రోఁతవలె నుండును. అప్పుడు సంగీతము పూర్తి కాఁగలదు.

శబ్దాయన్తఇతి.—హే మేఘ, అనిలైః పూర్యమాణాః, కీచకాః వేణువిశేషాః * 'వేణవః కీచకాస్తే స్యుర్యే స్వనన్త్యనిలోద్ధతాః' ఇత్యమరః. * 'కీచకో దైత్యభేదే స్యాచ్ఛుష్కవంశే ద్రుమాన్తరే' ఇతి విశ్వః, మధురం శ్రుతిసుఖం యథాతథా, శబ్దాయన్తే శబ్దం కుర్వన్తి, స్వనన్తీత్యర్థః, 'శబ్దవైరకలహాభ్రకణ్వమేఘేభ్యః కరణే' ఇతి క్యజ్. అనేన వంశవాద్యసంపత్తిరుక్తా, సంసక్తాభిః సంయుక్తాభిః, వంశవాద్యానుషక్తాభిర్వా, 'సంరక్తాభిః' ఇతిపాఠే సంరక్తకణ్ఠీభిరిత్యర్థః, కిన్నరీభిః కిన్నరస్త్రీభిః, త్రయాణాం పురాణాం సమాహారస్త్రిపురం, 'తద్ధితార్థోత్తరపదసమాహారే చ' ఇతి సమాహారసమాసః, పాత్రాదిత్వాన్నపుంసకత్వం, తస్య విజయో గీయతే, కన్దరేషు దరీషు 'దరీ తు కన్దరో వాస్త్రీ' ఇత్యమరః, తే తవ, నిర్హ్రాదః మురజే వాద్యభేదే, ధ్వనిరివ, మురజధ్వనిరివేత్యర్థః, స్యాచ్చేత్ తర్హి, తత్ర చరణసమీపే, పశుపతేః నిత్యం సన్నిహితస్య శివస్య, నృత్యత ఇతి శేషః, సంగీతం సమ్యగ్గీతం, 'సమ్యగ్గీతం తు సంగీతం న్యాయారమ్భే ప్రసిద్ధకే. తౌర్యాణాం త్రితయే చాపి' ఇతి శబ్దార్ణవే, తదేవార్థః. సంగీతార్థః సంగీతవస్తు, 'అర్థోఽభిధేయ రై వస్తు ప్రయోజన నివృత్తిషు' ఇత్యమరః, సమగ్రః సంపూర్ణో, భావీ నను భవిష్యతి ఖలు, 'భవిష్యతి గమ్యాదయః' ఇతి భవిష్యదర్థే ణినిః.

ప్రాలేయాద్రేరుపతట మతిక్రమ్య తాంస్తా న్విశేషాన్
హంసద్వారం భృగుపతియశోవర్త్మ యత్క్రౌఞ్చరన్ధ్రం,
తేనోదీచీం దిశ మనుసరేస్తిర్యగాయామశోభీ
శ్యామః పాదో బలినియమనాభ్యుద్యతస్యేవ విష్ణోః. 61

టీ. ప్రాలేయాద్రేః = హిమవంతముయొక్క, ఉపకటం = కటముల సమీపమునందు, తాం స్తాన్విశేషాన్ = ఆ యా చూడఁదగిన వస్తువులను, అతిక్రమ్య = తప్పించుకొని పోయి, హంసద్వారం = హంసలయొక్క దారి యును, భృగుపతి యశోవర్త్మ; భృగుపతి = పరశురాముని యొక్క, యశః = కీర్తియొక్క, వర్త్మ = మార్గమును, (అగు) యత్ క్రౌఞ్చరన్ధ్రం = ఏ క్రౌంచగిరి రంధ్రము గలదో, తేన = ఆ రంధ్రముచే, బలినియమనాభ్యుద్యతస్య; బలి = బలిచక్రవర్తిని, నియమన = బంధించుటయందు, అభ్యుద్యతస్య = పూనియున్న, విష్ణోః = విష్ణువుయొక్క, శ్యామః = నల్లనిదైన, పాద ఇవ= పాదము వలె, తిర్యగాయామ శోభీ = అడ్డముగను పొడవుగను ప్రకాశించుచున్నవాఁడవై; ఉదీచీం దిశం = ఉత్తరపు దిక్కుఁ గూర్చి, అనుసరేః = పొమ్ము.

తా. హిమాద్రియందెన్నెన్ని వింత సంగతులున్నవి. వాని నన్ని జూడవలయు నన్న కాలహరణ మగును. కాన నీమార్గమున బొమ్ము. పోవు చుండఁగా క్రౌంచమను మహాగిరి నీ కడ్డము వచ్చును. దాని నెక్కి పోవుటకన్న సులువైన మార్గముఁ జెప్పెద వినుము. తొల్లి పరశురాముఁడు కుమారస్వామితో నస్త్రవిద్య పరమేశ్వరునియొద్ద నేర్చుకొనుచు కుమారస్వామితో స్పర్ధచేత వాఁడి తూపులతో క్రౌంచమును భేదించి ప్రసిద్ధి కెక్కెను. అప్పటినుండి భూమిమీఁది హంసలు వర్షాకాలము వచ్చు ననఁగనే యా రంధ్రమునుండి వెడలి మేఘమండలమునకుఁ బైన నుండు మానస సరోవరమునకుఁ జేరును. నీవును ఆ మార్గముగుండా నడ్డముగా పొడవుగాఁ బొమ్ము. అప్పుడు నీవు త్రివిక్రమమూర్తి సర్వలోకమును వ్యాపించుటకు నెత్తిన పాదమువలె శోభిల్లుచుందు వని తాత్పర్యము.

